# మహా పరినిబ్బాన సుత్తము

# తెలుగు లో– భాగము- 1

{ బుద్ధుని చివరి రోజుల లోని సంగతులు }



బై వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

**Wats ap no of the writer - 990482191 if u wish to leave a comment**



**naponiNyaka Thera** అసలు పేరు **Siegmund Feniger**

మహా పరినిబ్బాన సుత్త 1-06-24

తాము ప్రత్యక్షంగా చూసినదానిని గురించి మరొకరికి వివరించి చెప్పే విధానాన్ని సుత్తము అంటారు . సాక్షి ఉపన్యాసాల్లో - జంఝాలా శాస్త్రి తాను స్వయముగా చూసి వచ్చిన విషయాలని సభావారికి వివరించుతాడు . అనగా అయన ఉపన్యాసము / లేదా ప్రసంగము/లేదా సుత్తము చెప్పాడు . అని నా ఉదాహరణ. బుద్ధుడు--మూడు నెలలకు ముందుగా నే - తాను Parinibbana ము అనగా మృత్యువు అనంతరము ఉన్న స్థితికి చేరుకో బోతూ వున్నానని ప్రకటించాడు . దీనిని కనులారా చూడటానికి బౌద్ధ సంఘాల వారు విచ్చేసారు . బుద్ధుడు దక్షిణపు దిక్కునకు నొక్కి పెట్టుకొని కూచోవటం వల్లనూ, ఆయన తాను మరణించ బోతూ వున్నాను అనే ఉద్దేశ్యముతోనే అనేక సంగతులు ప్రవచిస్తూ ఉన్నందు వల్లనూ, బుద్ధుని కి మరణము అని వార్యము అని ప్రతి ఒక్కరూ ఆభిప్రాయ పడ్డారు .బుద్ధుడు చెపుతున్న విషయాలలో ఘాడత , సంపూర్ణత గ్రహించిన ఆనందుడు - బుద్ధుని స్తుత్తములను గ్రంథస్థము చేశాడు. . మహాపరినిబ్బాన సుత్త అనగా బుద్ధుడు తాను మరణించుటకు ముందు ఇచ్చిన ఉపన్యాసము లేదా

సుత్తము ను తిరిగి ప్రవచిస్తూ  మహా పరినిబ్బాన సుత్తము అను పుస్తకము వచ్చింది . ఇది  బుద్ధులకు ఎంతో పవిత్రము అయినది .
సుత్తములు  ,  అనేక మందిని బుద్ధిజం వేపు ఆకర్షించుతవి అనీ ,  సామాన్యులను కూడా చదివేట్లు ప్రేరేపించుతుంది  అనే ఉద్దేశ్యముతో సుత్తములను  గ్రంథస్థము చేశారు . పండిత పామరులనుండి --సాక్షి ఉపన్యాసాలకు  లభించిన ఆదరణ ఏ దీనికి రుజువు .  సుత్తములే బుద్ధిజం ఒక ప్రపంచ మతము కావటానికి తోడ్పాటు అందించినవి అని నమ్ముతారు ..బౌద్ధ మతము లో  మొత్తము 34 .పెద్ద ఉపన్యాసాలు వున్నాయి .  వీటిని దిగ నికాయములు అంటారు - అనగా పెద్ద ఉపన్యాసాల యొక్క కూర్పు అని  . ఈ దిగ నికాయలలో  మహా పరినిబ్బాన సుత్త - 16  వ ఉపన్యాసము . ఈ ఉపన్యాసము యొక్క నిడివిని బట్టి మరియూ దీని లోని విషయాన్ని బట్టి , ఇది బుద్ధిస్టుల పాలిటీకి ముఖ్య ఉపన్యాసము .
ఇక ముందు మనము మహాపరినిబ్బాన సుట్టలోని విషయాలను క్లుప్తంగా చదవ పోతూ వున్నాము.
maha-parinibbana Sutta అను పుస్తకము పాళీ భాషలో వున్నది .శ్రీలంక బుద్దిస్టు అయినా Nyanaponika మహాథేరా అనే అయన ఈ  పుస్తకాన్ని - జెర్మనీ భాషలో కి మార్చి యధావిధిని చెబుతూ ఉండగా -  - బౌద్ధ మత అవలంబుకురాలు ఐన -ఒక జర్మనీ వనిత ఆ వ్యాఖ్యానాన్ని  జెర్మనీ భాషలో రాసుకుంది  . తరువాత ఇది జర్మనీ నుండి ఇంగిలీషు లోకి అనువాదం అయినది . పుస్తకము  లోని విషయము తెలుసుకునే ముందుగా దీని రచయిత గురించి తెలుసుకోవాల్సిన విషయము  ఎంతో వున్నది .
NaponiNyaka Thera అసలు పేరు Siegmund Feniger  21 July 1901 లో  Hanau  అనే  , Germany.దేశపు పట్టణములో లో జన్మించారు . ఈయన యూదుడు . జెర్మనీ లోనిహిట్లర్ యొక్క  జాతి అహంకార ధోరణి వల్ల, యూదులు జెర్మనీ వీడి పోతూ వున్నారు . అప్పుడు ఈయన తల్లి జర్మనీ  వదిలి వియన్నా చేరుకుంది . అక్కడ వున్నపుడు ఈయన Nyanatiloka Thera అనే శ్రీలంక బౌద్ధ గురువు రాసిన పలు  బౌద్ధ గ్రంధాలు చదివి బౌద్ధ మతానికి ఆకర్షితులు అయ్యారు . వీరు 1936 లో        శ్రీలంక చేరుకొని Nyanatiloka Thera వద్ద శిష్యునిగా చేరారు.  1939, లో జెర్మనీ యూదులపై దాడిని ఉదృతం చేసినపుడు  ఈయన తన తల్లిని మరియూ తన బంధువులను శ్రీలంకకు రప్పించి వారికి ఆశ్రయం కల్పించారు .

1948 వరకూ శ్రీలంక బ్రిటిష్ వారి పాలనలో వుంది . బ్రిటీష్ వారు జెర్మనీతో యుద్ధానికి డిగ్గటానికి ముందు - ఈయనను జర్మన్ గూఢ చారిగా చిత్రించి శ్రీలంక లోని జైలుకు తరలించారు. ఆపై శ్రీలంకనుండీ భారత దేశములోని దేహరాడూన్ జైలుకు తరలించారు . ఈయన అక్కడ వున్నపుడు అనేక బౌద్ధ గ్రంధాలను చదివి వాటిని జెర్మనీ భాషలోకి రాసారు .
ఈయన చెప్పిన మహా పరినిబ్బాన సుత్త ను నేను క్లుప్తీకరించి తెలుగులో రాయాలని సంకల్పించాను . ఇది ఆ ప్రయత్నానికి ముందు మాట లాంటిది .

సేకరణ వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

.



నయానాపోనిక గారి శ్రీలంక బుద్ధ ఆశ్రమము

బుద్ధుని స్తుత్తములు- అనగా ప్రవచనాలు - మనకు లభించటానికి ముఖ్య కారకుడు ఆనందుడు .తన శిష్యునిగా వున్న ఆనందుని 25 సంవత్సారాల పాటు పరీక్షించిన పిమ్మట -" ఆనందుడు , తాను

చెప్పిన విషయాలలో ని సూక్ష్మమును గ్రహించ గలిగిన నేర్పరి అని, ఆనందుడు ఎన్నో విషయాలను ఎన్నో కాలాల పటు గుర్తు పెట్టుకోగలుగు తాడని బుద్ధునికి నమ్మకం కలిగింది .ఆనందుడు ఏమి చెప్పినా ఏమి రాసినా అది బుద్ధుని మనస్సులోని భావాన్ని ప్రతిబింబిస్తుంది అని బౌద్ధులు అందరూ నమ్ము తయారు . ఇందువల్ల ఆనందుడు చెప్పిన విషయాలకు , బుద్దుడి స్వయంగా చెప్పిన వాటికి ఇచ్చిన విలువను ఇస్తారు .

ఆనందుడు బుద్ధుని వెంట ఉంటూ బుద్ధుని బాటలో పయనించి నిర్వాణమునకు కృషి చేయలేదు . తన జీవితాన్ని బుద్ధుని బోధనలలో ని మర్మము గ్రహించటానికి మరియూ మోక్ష సాధనా మార్గాలను బుద్ధుని తరువాతి తరముల వారికి యధా తదముగా అందించటానికి కృషి చేస్తూ జీవనం గడిపాడు . ఇతరులకు తెలపాలి అన్న కాంక్షతో బుద్ధునితో పాటు మోక్ష సాధనమునకు పూనుకోకుండా వదులు కున్నాడు కాబట్టి అనంతుని గొప్ప త్యాగశీలిగా కూడా గుర్తిస్తారు .



ఆనందుడు - బుద్ధునికి అతి ముఖ్య శిస్యుడు - భారత సంతతి వాడు

మహా పరినిబ్బాన సుత్తము 08 -10 -2024

{ బుద్ధుని చివరి రోజుల లోని సంగతులు }

మగధ రాజ్యము లో జరుగుతున్న సంగతి --

మగధ రాజైన అజాత శత్రుడు వజ్జీయులు అనే వారి రాజ్యము మీద యుద్ధమునకు పోవ సంకల్పించాడు . కారణము ఏమిటంటే - వజ్జీయుల గొప్ప వారు అవుతూ ఉండటాన్ని , పెరుగుతూ వున్న వారి కీర్తి ప్రతిష్టలను చూసి అజాత శత్రుడు జీర్ణించుకోలేక పోతూ వున్నాడు

.అందువలన వారిని సర్వ నాశనము చేయాలని మనస్సులో నే ప్రతిన పూని యుద్ధానికి సిద్ధము అవుతూ వున్నాడు .

అజాత సెత్రుడు తన మంత్రులలో ని ముఖ్యుడు - బ్రాహ్మణుడు -ఐన వస్సకారుఁడు అనే వానిని పిలిచి - "మీరు వెళ్లి బుద్ధునికి నా పాదాభి వందనాలు తెలిపి, ఆయనకు మంచి ఆరోగ్యము, కీర్తి, కలగాలని నేను ఆకాంక్షించానని తెలిపి , ఆపై నేను వజ్జీయుల ను సమూలంగా మట్టు పెట్టుటకు గానూ, యుద్ధము చేయుటకు వెడుతూ వున్నానని విన్నవించండి . బుద్ధుడు అనవసర ప్రసంగాలు చేయువాడు కాదు కాబట్టి అయన చెప్పినది శ్రద్ధగా విని దానిని మీ మనసులో ఉంచుకొని - తిరిగి వచ్చిఆయన ఏమి అనినది నాకు తెలియ చెప్పండి " అని కోరాడు .

అనేక వాహనాలను వెంట తీసుకొని - ఒక దానిలో తాను ఆసీనుడై - వస్సకారుఁడు తన రాచకార్యము మీద బయలు దేరి వెళ్ళాడు . బుద్ధుని నివాసము నకు కొంత దూరము ముందు గానే "వస్స కారుడు" తన వాహనము దిగి కాలినడకతో వెళ్లి బుద్ధుని దర్శించాడు . కొన్ని మర్యాద పూర్వక మైన మాటల అనంతరము వస్సకారుఁడు బుద్ధుని పాదాలను అర్చించి " దేవా గౌతమా -- "మా మగధకు రాజు ఐన అజాత శత్రువు - వజ్జీయుల మీద యుద్ధము నకు వెళ్ళ బోవుచున్నట్లు మీకు మనవి చేయమని నన్ను పంపారు " అని విన్నవించుకున్నాడు .

గౌతమ బుద్ధుని చెంతన అయన ముఖ్య శిష్యుడైన ఆనందుడు నిలబడి ఆయనకు వింజామర వీస్తూ వున్నాడు .

బుద్ధుడు ఆనందుని ఉద్దేశించి " ఆనందా వజ్జీయులుతమలో తాము సమావేశాలు జరుపుకుంటూ ఉన్నారా ? అందరూ ఆ సభలలో పాల్గొంటూ ఉన్నారా ? నీవు ఏమి విన్నావు ?" అని అడిగాడు

"" అవి అలాగే జరుగుచున్నవి అని నేను విన్నాను "

"ఆనందా .. ఆలా జరుగుతూ ఉన్నంత కాలమూ వజ్జీయులు అభివృద్ధి చెందుతారు అని ఏ కానీ నశించి పోరు అని ఊహించ వలసి ఉంటుంది ." అన్నాడు బుద్ధుడు . అని " ఆనందా ఇంకా ఏమి వున్నావు ? వజ్జీయులు శాంతియుతముగా సమావేశము లు నిర్వహించుకొని, సఖ్యతతో విడిపడి వెళ్లి పోవుచున్నారా ?

"అదే జరుగుతున్నదని వింటున్నాను "

"అయితే ఆనందా, ఇది కూడా వజ్జీయుల పురోగతిని చూపిస్తూ ఉన్నదేకానీ వారి నశింపును కాదు. అయితే మరి వజ్జీయులు తమ పాత చట్టాలను రద్దు పరుచుకొని కొత్త చట్టాలను రూపొందించుకోవడం లేదా ? "

"వారు మీరు ఆశించినట్లే చేస్తూ వున్నారు "

"ఆనందా ఇట్లా చూసినా కూడా వజ్జీయులు పురోగమించ వలసిన వారే కానీ నశించి పోవాల్సిన వారు కాదు .అయితే ఆనందా వజ్జీయులు వారి పెద్దలను గౌరవిస్తూ వారి సలహా సంప్రదింపులుతీసుకుంటూ ఉన్నారాలేదా ?

"అవును వారు అలాగే చేస్తూ వున్నారు అని విన్నాను "

"వజ్జీయులు స్త్రీలను చెరపట్టక ఉన్నారా ? స్త్రీలను అపహరించక ఉన్నారా ?" "వారు అలాంటి పనుల నుండి దూరంగా వున్నారు అని విన్నాను "

"వజ్జీయులు తమ దేవతల పట్ల , గుడుల పట్ల భక్తీ శ్రద్ధలు కనపరుస్తూ ఉన్నారా ?" "పట్టణ పు ధనవంతులకు మరియూ - పట్టణమునకు వెలుపల గల సామాన్యులకూ - దేవాలయాలలో సమాన గౌరవము దక్కుతున్నదా ? ఇచ్చే కానుకలను పట్టి ఎవరికన్నా , ఏవైనా సేవలు తిరస్కరింప బడుతూ వున్నవా ?

" దైవ మందిరాలలో అందరికీ సమాన గౌరవము లభిస్తూ వున్నది . కానుకల పేరున  దోపిడీ ఏదీ జరుగుట లేదు అని నేను విన్నాను  " అన్నాడు ఆనందుడు .

"వజ్జీయులు తమ లోని బౌద్ధ మతస్తులను రక్షిస్తూ వున్నారా ? వేరే రాజ్యము ల నుండి వచ్చే బౌద్ధ మతస్తుల పట్ల  వజ్జీయులు అనుకూలురేనా ? ఆ వచ్చిన వారు అక్కడ  శాంతి యుతంగా జీవనం కొనసాగించ గలుగుతూ ఉన్నారా ?

"అలాగే జరుగుతున్నది అని ఏ  విన్నాను "

" అయితే ఆనందా వజ్జీయులు  అభివృద్ధి చెందవలసిన జాతి ఏ కానీ నశించి పోవాలిసిన జాతి కాదు "

పై సంభాషణ అనంతరము బుద్ధుడు వస్సకారుః ని   వంకకు తిరిగి " ఓ బ్రాహ్మణా , విన్నావుకదా ? పై సుగుణాలు పాటించినంత కాలము వజ్జీయులు నశించి పోరు . వైశాలి పట్టణములో, Sarandada మందిరములో  వున్న నేను ఈ మాటలు చేప్పాను అనిఅని మీ రాజునకు చెప్పవలసింది--  " అన్నాడు

పై విషయాలను గమనిస్తే - "వజ్జీయులు నశించి పోరు" అని బుద్ధుడు పలికిన మాటలు అయన ఆశీర్వచనములాగా తోస్తున్నవి . వజ్జీయుల రాజ్యములో ప్రజాస్వామ్యము వర్ధిలుతున్నదా , వారి సమాజము మంచి

మానవత్వముతో నిండి ఉన్నదా? అని కూడా బుద్ధుడు ప్రశ్నిస్తూ వున్నాడని మీకు తోస్తూ ఉంటే అది కూడా నిజమే .




మహా పరినిబ్బాన సుత్తము 09 -10 -24

మగధ రాజైన అజాత శత్రుడు వజ్జీయులు అనే వారి రాజ్యము మీద యుద్ధము సంకల్పించి - ఆ సంగతిని బుద్ధునికి నివేదించమని - తన మంత్రి ఐన

వస్సకారుడు  అనే బ్రాహ్మణుని బుద్ధుని వద్దకు పంపాడు . ఈ సందర్భంలో వజ్జీయులు ఎవరు అన్నది ఒక్క సారి స్ఫురణకు తెచ్చుకుందాము .

వజ్జీయులు  అను వారు మన పురాతన భారత దేశములో ఉన్న 16  మహా జన  పదులలోని  ఒక తెగ . వీరి రాజధాని లేదా ముఖ్య పట్టణము వైశాలి . వ్యాకరణ కర్త పాణిని మరియూ చాణిక్యుడు వీరి గురించి అనగా వజ్జీయుల గురించి ప్రస్తా పించారు . వజ్జీయులు  అనేక ఉప తెగల సమూహము . ఈ ఉప తెగలలో Licchavis లిచ్ఛవిస్ మరియూ వైదేహులు Videhas అనే తెగలు ప్రాముఖ్యము  కల తెగలు

బుద్ధుడు  చెప్పిన సమాధానపు మాటలకు బదులుగా  బ్రాహ్మణుడైన వస్సకారుడు " గౌతమా నీవు అన్న అన్ని  సుగుణాలు వజ్జియులలో ఉంటే వారి అభివృద్ధికి ఆటంకము లేదు నశింపుకు దారి లేదు .కానీ మాకే కదా  హాని ? మా మగధ రాజు- అజాత శత్రు - మోసము - నమ్మక ద్రోహము చేయుట-- అనే రొండు పద్ధతుల ను విడనాడి యుద్ధము చేస్తాడు . మహనీయుడవైన ఓ గౌతమా మీరు నాకు సెలవు ఇవ్వవలసినది " అని వేడాడు .."

 " ఇప్పటికి ఏమి చేయటము మంచిదో అదే నీవు చేయవచ్చును " అని బుద్ధుడు బదులు ఇవ్వగా -- వస్సకారుడు   అదే   బుద్ధుని ఆశీర్వచనంగా భావించి ఆనందము పొంది అక్కడనుండి బయలు దేరాడు .

వస్సకారుడు అటు వెళ్ళగానే బుద్ధుడు ఆనందునితో " వెళ్లి ఈ రాజగృహ ప్రాంతములో నివసిస్తూ ఉన్న బౌద్ధ బౌద్ధ సన్యాసులందరినీ సమావేశ పరుచు " అన్నాడు . ఆనందుడు కొంత సమయము తరువాత తిరిగి వచ్చి " మీరు కోరినట్లు ఏర్పాటు ఐనది" అని విన్నవించాడు . అప్పుడు బుద్ధుడు లేచి వెళ్లి సమావేశ మందిరంలో ఉన్న ఆసనాన్ని అలంకరించి , బౌద్ధ సన్యాసులను ఉద్దేశించి - " సంఘము పురోగతిని ఆశించి నేను ఏడు నియమాలు విధించ బోతూ వున్నాను " అని చెప్పాడు

"అవి ఏవో చెప్పవలసినది ." అని సంఘీయులు శరణు ఘోష చేశారు .

అప్పుడు బుద్ధుడు -- 01 .మీరు తరచూ సమా వేశాలు జరుపుకుంటూ . ఎక్కువ మంది దానికి హాజరు అవుతూ , శాంతి యుతంగా సభలు ముగించుకొని సోదర భావముతో విడి పోవాలి . 02 .క్రొత్తగా సంఘ నియమాలను కల్పించుకో వద్దు .వినయ పిటకము లో చెప్పినది అనుసరించండి . 03 . కొత్త భిక్షువులు-- పాత వారి పట్ల గౌరవము చూపండి . పాత వారు తమకన్నా పాత వారి పట్ల గౌరవము చూపండి . మరీ పాత తరం వారు మృతి చెందిన వారిపట్ల గౌరవము చూపండి . వారే బౌద్ధ సంఘానికి పెద్దలు తండ్రులు వంటి వారు .వారి మాటలు స్మరించి - వారి మార్గాన నడవండి 04 .కోరికలతో తపన పడవద్దు - అది మిమ్మలను మొదటి స్థాయిలో నుండీ అధమ స్థాయి లోకి తీసుకు పోతుంది. 05 . అరణ్యములోని మారు మూలలు-గుహలు మీకు నివాసాలుఐ ఉండాలని ఆనందముతో కోరుకోండి . 06 . పూర్తి జ్ఞ్యానముతో వ్యవహరించండి . ఇకముందు ఈ భూ లోకమునకు రాబోవువారు మీ సోదరులని భావించి వారికోసమని లోకములో శాంతిని స్థాపించండి . 07 .ఇప్పటికే ఈ లోకములోనికి వచ్చినవారు కూడా మీ సోదరులే

అనే భావనతో శాంతిని నెలకొల్పటానికి కృషి చేయండి . ఈ ఏడు నియమాలను పాలించినంత కాలము బౌద్ధ మతము మరియూ బౌద్ధ బిక్షులు మనుగడలో వుంటారు . వీరికి పురోభి వృద్ధి ఏ కానీ నశింపు ఉండదు . " అని వచించాడు .

"ఇవే కాక నేను చెప్పబోవు మరికొన్ని నియమాలను కూడా మీరు అనుసరించ వలెను " అని బుద్ధుడు అన్నాడు . అలాగే అలాగే అంటూ సభ శరణు ఘోష చేసింది .

", బిక్షులు- మాట్లాడటం,సుఖంగా నిద్రించటం ,ఒకరికి ఒకరు తోడుగా ఉండటం చేయరాదు . కోర్కెలను దరి చేరనీయరాదు . చెడు స్నేహాలు చేయ వద్దు . సగము దారిలో నే మిమ్ములను వెనక్కు మళ్లించే మనస్తత్వము కల వారితో సాహచర్యము వద్దు. మిమ్ము చిన్న విజయము దిక్కుకు నడిపించి పెద్ద విజయాన్ని దూరము చేసే స్వభావము కల వారు వుంటారు - వారిని దరి చేరనివ్వవద్దు - ఈ నియమాలను అనుసరించి నంత కాలమూ బౌద్ధ బిక్షులు - నశింపు అన్నది లేకుండా అబివృద్ధి చెందుతూ నే వుంటారు ." అని ప్రవచించిన బుద్ధుడు ఆపై ఇంకా ఇలా కొనసాగించాడు "బిక్షులు తమపై తమకు ఉన్న నమ్మకము చెదిరి పోనివ్వ రాదు , తప్పుడు నడత పట్ల- సాధారణ మైన మనుషులకు వుండు సిగ్గు భయమును బిక్షులు త్యజించ రాదు, నేర్చుకొనుటలో నేర్పరి తనము కనపరచాలి ,ధృడ నిర్ణయాలు తీసుకో గలిగి ఉండాలి , చక్కని తెలివిని ప్రదర్శించాలి , " ఇవి అన్నీ అమలు పరచ బడినపుడు బౌద్ధ సంఘము ఎన్నటికీ నశింపు పొందక ఇంకా ఇంకా వృద్ధి చెందుతూ ఉంటుంది ".ఇట్లా అన్నాక బుద్ధు డు ఇంకా కొనసాగించాడు "బిక్షుల మోక్ష సాధన కోసమై కొన్ని నియమాలను చెపుతున్నాను వినండి .వాటిని

ఆచరించండి . బుద్ధి జాగురూకతో వుండండి, ఏది ఎందులకు జరిగింది ? అనేది శోధించండి , అందులకు కారణమైన శక్తీ, ఏమిటి ? అది ఇచ్చిన ఆనందముఏమిటి ? , అది ఇంత ఆనందమును ఎందుకు ఇచ్చింది ?, ఇది ఇంత ప్రశాంతత ఎందుకు ఇచ్చింది ? అన్నింటి మధ్య ఉన్న సమానత ఏమిటి? అని కూడా శోధించండి - మీబు ఇలా చేసినంత కాలమూ మీకు అభ్యున్నతే కానీ నశింపు ఉండదు " బౌద్ధ సన్యాసులు మరలా శరణు ఘోష చేశారు .

బుద్ధుడు తన బౌద్ధ సంఘము శాశ్వతత్వముని కోరి పై సంగతులు చెప్పాడు . ఇవి ఉన్నతి సాధించ గోరిన మనుషులకు - మానవ సమూహాలకు కూడా వర్తిస్తాయని నా భావన .

బౌద్ధ గ్రంధము ఆధారంగా తెలుగు లోకి రాసి చెప్పినది - వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి - బెంగుళూరు లో నుండి . on 09-10-24

మహా పరినిబ్బాన సుత్తము - మూడు

బుద్ధుని చివరి ప్రసంగాలు

బుద్ధు డు ఇంకా ఇలా కొనసాగించాడు "బౌద్ధ బిక్షులు - ఒకే రకపు జీవిత విధానానికి అంటి పెట్టుకోరాదు - అహంభావాన్ని వదలాలి - ఆత్మ మరియూ శరీర శుభ్రత ఆచరించాలి - అధోగతిలో ఉన్న వారిలా ప్రవర్తించ వద్దు -

మనస్సుల్లో ఏదీ వుంచుకోవద్దు - మధ్య మధ్య కొంత విరామము కోసము ప్రయత్నించ వద్దు - మీరు ఇలా చేసినంత కాలమూ మీకు అభ్యున్నతే కానీ నశింపు ఉండదు "

ఇది విన్ బౌద్ధ సన్యాసులు మరలా శరణు ఘోష చేశారు . బుద్ధు డు ఇంకా ఇలా కొనసాగించాడు " అవసర సమయాలలో - మీ మాటల ద్వారానో ఆలోచన ల ద్వారానో - మీలో ఒకరికి ఒకరు సాయంగా వుండండి- మీకు భిక్షా పాత్ర ద్వారా దొరికినది ఏది అయినా సరే అది గౌరవముతో తీసుకోండి - దానిని తోటి వారితో పంచుకోండి ,- దేని గురించీ మనసును చెదర కొట్టుకోవద్దు -- మీరు ఇలా చేసినంత కాలమూ మీకు అభ్యున్నతే కానీ నశింపు ఉండదు "

బౌద్ధ సన్యాసులు మరలా శరణు ఘోష చేశారు .

ఇప్పుడు వజ్జీయుల రాజ్యములో వారి రాజధాని అయినా రాజ గృహ లో బుద్ధుడు వున్నాడు . ఇక్కడ అయన తరచూ బౌద్ధ సంఘాల వారికి సలహాలు సూచనలూ ఇస్తూ వున్నాడు ."మీలో సుగుణాలు పెరిగిన కొద్దీ మీకు విషయాల మీద శ్రద్ధ పెరుగుతుంది - శ్రద్ధ ని పట్టి తెలివి పెరుగుతుంది -- తెలి వివల్ల చక్కని వ్యక్తిత్వము వృద్ధి చెందుతుంది -- .మీ వ్యక్తిత్వమీ మిమ్మలను మీ కోరికలు అనే కామము నుండి విడుదల చేస్తుంది . ఆ విడుదల పొందిన వారు జ్ఞానులు అవుతారు ."అని చెప్పాడు

బుద్ధుడు ఒకనాడు ఆనందునితో " ఆనందా మనము ఈ  రాజగహ లో ఉండ తలచిన అంత కాలము వున్నాము . ఇహ మనము  Ambalatthika అమ్బలట్థికా కి వెళ్ళుదాము " అన్నాడు .{ ఈ సమయానికి బుద్ధుని కుమారుడు రాహులుడు  అమ్బలట్థికా లో వున్నాడు}

 బుద్ధుడు , ఆనందుడు, ఇంకా చాల మంది బౌద్ధ భిక్షు లతో  కలిసి అమ్బలట్థికా చేరారు .  బుద్ధుడు రాజగిహ లో చేసిన చివరి ప్రసంగాన్ని- తిరిగి మరలా ఇక్కడ కూడా చేసాడు   .

 అమ్బలట్థికా లో ప్రసంగించిన పిమ్మట "ఆనందా మనము నలందా కి వెళ్ళుదాము " అని బుద్ధుడు అన్నాడు "

బుద్ధుడు , ఆనందుడు, మరింత మంది  బౌద్ధ భిక్షు లతో  కలిసి అమ్బలట్థికా వీడి నలందా చేరాడు  . "పావారిక"  అనేమామిడి తోపులో నివాసం ఏర్పరుచుకున్నాడు.

ఒకనాడు  సారిపుత్తుడు అనే బుద్ధుని ప్రముఖ శిష్యుడు - బుద్ధుని పాదాలను అర్చించి " మోక్షము / జ్ఞ్యానము / ఎంకాంత వాసము అనే ఉన్నత మైన విషయము మీద మాకు జ్ఞ్యానము ప్రసాదించండి " అని  కోరాడు

"సరిపుత్తా -- గతములో జ్ఞ్యానము/ మోక్షమును పొందిన వారి గురించి - నీకేమైనా తెలుసునా ? '" లేదు" " ఇకముందు జ్ఞ్యనమును / మోక్షమును పొంద పోయే వారి గురించి నీకేమైనా తెలుసునా ? "లేదు"

"సారిపుత్తా - నేను ఎవరినో - నా అర్హత ఏమిటో- నా సుగుణాలు, నాధ్యానము దేనిగురించో , నేను పొందిన జ్ఞ్యానము . నేను సాధించబోతూ ఉన్న విముక్తి ఏమిటో నీకు తెలుసునా ?" " లేదు "

"సారిపుత్తా - ఇప్పుడు అంతా స్పష్టము . గతములో మోక్ష సాధన చేసిన వారి గురించి - ఇప్పుడు మోక్ష సాధన చేస్తున్న వారి గురించి - ఇక ముందు - మోక్షము సాధింప దలచిన వారి గురించి - నీకేమీ తెలియదు .అలాంటి నీవు ఇంత మంది మధ్యన - ఇంత పెద్దగా - ఎంతో ధైర్యంగా ఎందుకీ ప్రస్తాపన చేసావు ?" అని బుద్ధుడు సింహములాగా సారిపుత్తుని మీద గర్జించాడు . బుద్ధుడు శాంతము వీడి సింహమంలా గర్జించటము ఇదియే మొదటి సారి . అందువలన దీనిని సింహగర్జన అని పిలుస్తారు .

సింహగర్జనకు భీతిల్లిన సారి పుత్రుడు ఇలా అన్నాడు " మోక్షము సాధించటానికి నేను అత్యంత ఉత్సాహము కనపరిచాను "

అప్పుడు బుద్ధుడు " ఏ వ్యక్తులకూ లేని లాంటి జ్ఞ్యానము నాకు స్వంతము . గత జన్మ -- ఈ జన్మ -- రాబోవు జన్మల ద్వారా నేను జ్ఞ్యానము తెలుసు కుంటూ వుంటాను . నీవు , ఒక ఉదాహరణ చూడు .రాజు ఒక దుర్భేద్యమైన

కోటను నిర్మిస్తాడు .దానికి ఒకే ప్రవేశ ద్వారము పెటిస్తాడు - ఆ ద్వారము వద్ద ఓ కాపలా దారు ఉంటాడు . వాడు ప్రతి వారిని ద్వారమునకు దూరముగా ఉంచుతాడు . కానీ తన స్నేహితుడు అనుకున్న వారిని లోనికి వదులుతాడు .అతడు కోట చుట్టూ పహారా తిరిగేప్పుడు పిల్లిని కూడా లోనికి చోరబడనివ్వడు . అతని ఉద్దేశ్యములో వచ్చేయి పోయేవి అన్నీ కూడా కోట గుమ్మము ద్వారానే రావాలి పోవాలి అని . అదే విధముగా మనిషిలోని కి వచ్చి పోయే గుణాలు అన్నీ కూడా ధ్యానము అనే మార్గము నుండేలోనికి రావాలి బయటికి వెళ్ళాలి" . { అనగా చెడుగుణాలు ధ్యానము ద్వారా నే బయటికి పోవాలి - సద్గుణాలు కూడా ధ్యానము ద్వారానే లోపలి కి రావాలి . ధ్యానము అనేది మనస్సు అనే కోటకు రాజద్వారము }

"ధ్యానము యొక్క ప్రాముఖ్యత ఏమిటో నేను తెలుసుకున్నాను" అని సారి పుత్రుడు అన్నాడు . రచన వివరణ వారణాసి శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి 10 -10 -24 బెంగళూరు నుండి



Royal procession leaving Rajagriha, possibly depicting Ajatashatru, from Sanchi[

మహా పరినిబ్బాన సుత్తము - నాలుగు -11 -10 -24

బుద్ధుని ప్రసంగాలు - బుద్ధుడు సరిపుత్రుడు అనే శిష్యునితో మాట్లాడుతూ వున్నాడు .

బుద్ధుడు అన్నాడు " ఓ సారి పుత్రా " గత జన్మములోనే జ్ఞ్యానమును పొందిన వారు : 01 సున్నితమైన కోరికలు , 02 . చెడు తలంపులు 03 . భద్దకము మరియూ శరీరపు తిమ్మిరులను ,04. పశ్చాతాప పడ లేని మనో స్థితిని - విశ్రాంతి తీసుకో లేని మనో స్థితిని 05 . అనవసర సందేహాలను పొందే స్థితిని జయించుతాబు . ఈ ఐదు గుణాలు తొలిగి పోని వాడి మనసు కలుషితము . ఈ కల్మషాలు తొలిగిన వారు - మోక్ష మార్గమును ఎంచుకొన్నపుడు వారికి మోక్షము లభిస్తుంది "

బుద్ధుడు ఇంకా అన్నాడు " ఓ సారి పుత్రా ముందు ముందు మోక్షము పొంద పోయే వారు పైన చెప్పబడిన ఐదు కల్మష గుణాలను ఈ జన్మలో విసర్జిస్తారు . ధ్యానము ద్వారా మోక్షము పొందటానికి గానూ అవసర మైన ఏడు నియమాలను అలవాటు చేసుకుంటారు .వారు మోక్ష మార్గములో పోతూ దాటి పెళ్ల వల్సిన వాటిని దాటి పెళుతారు "

" ఇప్పుడు మోక్షము సాధించ బోయే వారు ఆదుర్దా , భయము , కోపము , కోరికలు, అసూయా ద్వేషాలు ,కుంగు బాటు అనే మనో స్థితులను జయించాలి . ఈ మనో స్థితులు మనిషి తెలివిని జ్ఞనాన్ని నిర్వీర్యము చేస్తాయి . ఈ జన్మలో ఈ మనో తత్వాలను జయించిన వాడు - ధ్యానము ద్వారా మోక్షము పొందటానికి గానూ అవసర మైన ఏడు నియమాలను పాటించటం ద్వారా మోక్ష మార్గములో పోతూ దాటి పెళ్ల వల్సిన వాటిని దాటి పెడతారు ".

నలంద ,లో ని పావారిక అనే మామిడి తోటలో వున్న బుద్ధుడు- బౌద్ధ అర్హతులను ఉద్దేశించి బుద్ధుడు పై ప్రసంగాలు ఏ కాక మరి కొన్ని ప్రసంగాలు కూడా చేసాడు. ఒకనాడు బుద్ధుడు " ఆనందా -- మనము ఈ నలంద నుండి పాటలిగాం వెళ్ళుదాము " అనగా - ఆ ఇరువురూ అక్కడికి చేరుకున్నారు .

అనేక మంది బిక్షువులతో కూడి బుద్ధుడు పాటలిగాం లో ఉండగా - ఊరి ప్రజలు ప్రముఖులు వచ్చి బుద్దిని సేవించి - పుర మందిరములో ప్రజలను ఉద్దేశించి ప్రసంగించ వలెనని బుద్ధుని కోరారు . బుద్ధుడు అంగీకరించగా వాఋ ఆనందముతో వెడలి పోయారు . వారు పురమందిరాన్ని దీపాలతో అలంకరించి . ప్రజలకోసము నీరు, ఆసనాల వసతి కల్పించారు .

నైతిక విలువలతో జీవించటం - అనైతిక విలువలతో జీవించటం అనే విషయము మీద బుద్ధుడు పాటలిగాం ప్రజలను ఉద్దేశించి ప్రసంగించాడు.

మహాపరి నిబ్బాన సుత్తము 15 -10 -24

బుద్ధుని తుది ప్రసంగాలు

నైతిక విలువలతో జీవించటం - అనైతిక విలువలతో జీవించటం అనే విషయము మీద బుద్ధుడు పాటలిగాం ప్రజలను ఉద్దేశించి ప్రసంగించాడు .బుద్ధుడు చెప్పిన దాని ప్రకారం గృహస్థాశ్రమము పాటించే వారికి ఐదు ఆశీర్వచనాలు వున్నాయి

.అవి ఎక్కువ ఆయుః ప్రమాణము - మంచి రంగు గల దేహము -సుఖము - బలము - చివరిగా వ్యక్తిగత ఇష్టాన్ని అనుసరించి ధ్యానము లేదా / పూజా చేసుకునే అదృష్టము .ఇవి గృస్తులకు మూలధనం మీద వడ్డీ లభించిన ఆనందాన్ని కలుగ చేస్తాయి . అట్లాగే సన్యాసికి లభించని జీవితమే గృహస్థు పాలిటి కి వరాలు అవుతాయి . గృహము నడుపుకోవటం లో గృహస్థు శ్రద్ధ చూపాలి. దీని ద్వారా అతని సంపద వృద్ధి చెందుతుంది . మంచి పేరు ప్రతిష్టలు సంపాదించుకోవాలి , సమాజం నుండి బహిష్కరించ బడతాననే భయము మనసులో ఉండాలి ,అలాగే మెతక తనము లేకుండా వ్యవహరిస్తూ ఉండాలి , బ్రాహ్మణుల కైనా ప్రభువుల కైనా సన్యాసుల కైనా- మరి ఎవరికైనా మరణము అనేది శాంతినే కలుగ చేస్తుంది . ఆ తరువాతనే దేహము నశిస్తుంది . ప్రతి వారికీ స్వర్గ లోకము లభిస్తుంది .{ దేహము విడిచిన పిమ్మట ఆత్మకు శాంతి లభిస్తేనే దేహము నశిస్తుందని అని బుద్ధుని బోధ . }

ఈ రకంగా ప్రవచిస్తూ బుద్ధుడు ఆ రాత్రిలోని ఎక్కువ భాగాన్ని పాటలిగామ లో వున్న భక్తులైన గృహస్థుల మధ్య గడిపాడు . ఈ ప్రసంగము వారిలోని ధర్మాన్ని , మేల్కొల్పింది. వారికి శక్తిని ఇచ్చింది . వారిని సంతోష పరిచింది . తన బోధనలు కొనసాగిస్తూనే వున్న బుద్ధుడు మధ్యలోనే ఆపి " గృహస్థూలారా - రాత్రి చాలా వేళా ఐంది . మీ మీ సౌకర్యాల కోసం మీరు ఇంటికి పోవచ్చు " అని చెప్పాడు .{ ఇలా బుద్ధుడు గృహస్తుల పట్ల తనకు గల గౌరవాన్ని తెలుపుకున్నాడు. బుద్ధుడు సన్యాసులుగా జీవించమని సాధారణ జనాన్ని ప్రోత్సహించలేదు . మోక్ష సాధన చేయాలి అనుకున్నవారిని ఉద్దేశించి అందుకు దారులుకనుగొన్నాడు అని నాఅభిప్రాయము }.

"అలాగే ప్రభూ " అని పలికి  పాటలిగామ గృహస్థులు తమ ఆసనాల నుండి మర్యాదతో లేచి - బుద్ధుడిని మరల మరల దర్శించుకుంటూ కదిలి పోయారు . అందరూ వెళ్లిన అనంతరం బుద్ధుడు విశ్రాంతి స్వీకరించాడు .

ఈ సమయానికి సునీధ  మరియూ  వస్సకార , అను మగధ రాజ్యపు ముఖ్య మంత్రులు - మగధ రాజ్యము మీదకు వజ్జియులు దాడి చేస్తే దానిని ఎదుర్కోవటానికి వీలుగా పాటలిగామ లో ఒక కోట ను నిర్మిస్తూ వున్నారు .  ఈ సందర్భంగా దేవీ దేవతల విగ్రహాలు వందలు వేల సంఖ్యలో పాటలిగామ లో వూరేగించబడినాయి . ఏ ప్రాంతము లో ని వారు ఏ దేవతను ఎక్కువగా ఆరాధిస్తారో, ఇష్టపడతారో  - అక్కడ  ఆయా  విగ్రహాల కు పెద్ద మందిరాలు కట్టారు . వీటికి  అధికారులు మొక్కారు .  ఎక్కడైతే - ఏ దేవీ దేవతలను సాధారణ గౌరవం తో చూస్తారో అక్కడ ఆ దేవతలకు తగుమాత్రపు మందిరాలు నిర్మించారు . వీటికి సాధారణ జనం మొక్కారు .ఊరేగింపు చేసిన దేవీ దేవతా విగ్రహాలను అనేక స్థలాలలో ఉంచి మందిరాలు నిర్మించారు  .

దీనిని పట్టి  బుద్ధుడు " ఆనందా - ఈ పాటలిగామా లో ఓ పట్ట ణాన్ని నిర్మించ బోవుతున్నది ఎవరు "  అని అడిగాడు .

"మగధ రాజ్యానికి ముఖ్య మంత్రులగు సునీధ  మరియూ  వస్సకార , లు -- వజ్జీయులను ఎదుర్కోవటానికి వీలుగా ఇక్కడ ఒక కోటను నిర్మిస్తూ వున్నారు " అని ఆనందుడు బదులు ఇచ్చాడు "

సేకరణ -సమర్పణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి ఎట్ బి. లొరు

మహా పరినిబ్బాన సుత్తము - 16 -10 -24 .

"అవునా ఆనందా , ఇది సునీధ మరియూ వస్సకార అను మంత్రులు ముప్పది ముగ్గురు దేవతల సలహాతో తమ పని చేస్తున్నట్లుగా వున్నది . చూడు ఆనందా నేను జ్ఞ్యాన నేత్రము కలవాడిని - మనుషుల జాతిని దాటివెళ్లిన వాడిని. అయినా నా కనుల ముందరగానే వందలాది దేవతా రూపాలు వేలాది ప్రతిమాలుగా వూరేగింపబడినాయి .[ దీనిని బట్టి బుద్ధుడు విగ్రహాలకు వ్యతిరేకి అని భావింప బడినాడేమో అని నా అభిప్రాయము ] గొప్ప దేవతలు ఇంకా కొనసాగుతూనే వున్నారు . గొప్ప అధికారం కల వారు వారికి మందిరాలు నిర్మించే పనిలో నడుములు వంచుతూ వున్నారు . మధ్యస్థమైన సెక్తి కల దేముళ్ళకు మధ్య తరగతి ప్రజలు మోకరిల్లుతూ వున్నారు- మందిరాలు నిర్మిస్తూ వున్నారు .[సాధారణ జనులు ఉన్నత స్థితి పొందిన వారిని అర్ధం చేసుకో లేక పోతున్నారని కాబోలు ] నిజం చెపుతున్నాను విను ఆనందా -- ఈ ఆర్య జాతి కొత్త దారులు వేసుకుంటూ విస్తరిల్లుతూ ఉన్నంత కాలమూ - ఈ పాటలీపుత్తా ఏ వర్తక వాణిజ్యాలకు ప్రముఖ కేంద్రంగా ఉంటుంది " "కానీ ఆనందా నిప్పు నీరు మరియూ భిన్న అభి ప్రాయాలూ " అనే మూడు విధ్వంసక శెక్తులు ఈ పాటలిపుత్త , మీద దాడిచేయనంత వరకూ దీని ప్రతిష్ట అలాగే కొనసాగుతూ ఉంటుంది "

{ఒక విషయము మీద ఇద్దరి మనుషుల భిన్నాభి ప్రాయము- నిప్పును నీరును మించిన విధ్వంసక సెక్తి అని మనము గమనించాలి. ఇప్పుడు జరిగే

ఇజ్రాయిల్ మరియు ఉక్రేన్ యుద్ధము మరియూ తీవ్ర వాద దాడులకు మూల కారణము ఇరువురు వ్యక్తుల మధ్య భిన్నాభి ప్రాయాలే కదా ? దాని వల్ల పట్టణాలకు పట్టణాలు తుడుచుకు పెట్టి పోవటం లేదా ? అని నాకు తోస్తోంది }

ఇంతలో  సునీధ  మరియూ  వస్సకార బుద్ధుని వద్దకు వచ్చి ఆయనకు ప్రణమిల్లి అపి ఒక పక్కాగా నిలబడి " గౌరవనీయ గౌతమా - రేపు బౌద్ధ భిక్షు సమూహానికి ఇవ్వబోతూ వున్న భోజనానికి మీరు రావలసింది " అని పలికారు . { ఇక్కడ నేను  కావాలనే "మేము" ఇవ్వబోతూ వున్న భోజనానికి ఉన్నఅనే మాటను వాడలేదు  . బుద్ధుని ముందు మేమెంత అన్న వివేకం వారికి వున్నది అనుకోని మేము అనే మాటను వదిలి వేసాను  అనుకోవచ్చు . లేదా విందు భోజనం వీరి ఖర్చుతో ఇచ్చేది కాదు.  రాజు గారి ఖర్చుతో ఇచ్చేది కదా ? అందువల్ల కూడా నేను "మేము " అనే మాటను వాడకుండా ఆగాను }

బుద్ధుడు తన మౌనమే తన అంగీకారము అన్నట్లు వున్నాడు . బుద్ధుడు తన అంగీకారం తెలిపాడని గ్రహించి సంతసించిన మహామంత్రులు , సునీధ మరియూ  వస్సకార లు వారి నివాసాలకు - ఎక్కడైతే వారు కోరుకున్న ఆహారము వేడిగానూ మృదువుగానూ దొరుకుతుందో అక్కడికి  వెళ్లి పోయారు . {గృహము అంటే ఇదే కోరుకున్న తిండి వేడిగా దొరుకుతుంది . ఎవరూ చెప్పక పోయినా గానీ గృహిణులు - భర్త పిల్లలు కోరుకున్నది వేడిగానూ మృదువుగానూ అందించే ప్రయత్నం లో వుంటారు . ఆ రకంగా వారు గృహాన్ని ఆకర్షణీయమైన చోటుగా మారుస్తారు .వారికి నా నమస్సులు }

సమయము ప్రకారము తిరిగి వచ్చిన మంత్రులు " గౌతమా. సమయం ఐంది. మీరు భోజనానికి రావచ్చును అని పలికారు .

అప్పటికి మధ్యహానపు వేళా  ఐ వుంది . బుద్ధుడు సన్యాసి వస్త్రాలు ధరించి , భిక్షా పాత్ర చేత బూని , ఇతర బిక్షువుల తో కలిసి మంత్రుల నివాసానికి దారి తీసాడు .   అక్కడ తనకు కేటాయింప బడిన ఆసనం పై కూచున్నాడు . మంత్రులు సునీధ  మరియూ  వస్సకార , లు బుద్ధునికి స్వయంగా వడ్డనలు చేశారు .వేడిది మెత్తనిది ఏ ఆహారము కావాలో అది అడిగి వడ్డించారు . బుద్ధుడు బిక్ష ముగించగానే వారు మోకాళ్లపై కూచుని అయన చేతి భిక్షా పాత్రను అందు కున్నారు

అప్పుడు బుద్ధుడు వారిని ఆశీర్వదిస్తూ ఇట్లా పలికాడు .

మిమ్మలను తన మంత్రులుగా చేసుకున్న ఆ  వివేక వంతుడు, మీ లాంటి వారిని తనకు గల విలువైన ఆస్తులుగా మార్చుకున్నవాడు ,  దేముళ్ళతో కలిసి వారి సుఖ సంపదలను పంచుకుంటాడు .  ఒకే ఓక్క మొగ పిల్లవాడు తన తల్లి ప్రేమను పొందిన విధంగా ఆ గౌరవనీయుడు దేవతల ప్రేమను పొందుతాడు . ఆపై దేవలోకపు దయ అన్నది అనుభవిస్తాడు .మంచి అదృష్టాలు పొందుతాడు  .

పై  ఆశీర్వచనం తరువాత బుద్ధుడు తన ఆసనం నుండి లేచాడు. తాము ఇచ్చిన భిక్షను స్వీకరించి వెళ్లి పోతూ వున్న బుద్ధుడిని సునీధ  మరియూ  వస్సకార లు అనుసరించి బుద్ధునితో ఇలా అన్నారు . " మీరు ఈ రోజున ఏ ద్వారం

కుండా వెళుతున్నారో అది ఇకముందు " గౌతమ ద్వారంగా పిలువ బడుతుంది . మీరు ఏ రేవు ద్వారా గంగను దాటి వెడతారో ఆ రేవు ఇకముందు నుండీ " గౌతముని రేవు " గా పిలవబడుతుంది అని చెప్పారు .ఇప్పటికి అందరూ కలసి ఇంతకు ముందు ఏ ద్వారము గురించి ప్రస్తాపన జరిగిందో ఆ ద్వారము వద్దకు వచ్చారు .

బుద్ధుడు గంగ ఒడ్డున గల రేవుకు వచ్చే సరికి గంగ అంచులను వొరుసుకొని ప్రవహిస్తూ వుంది . గంగ ఒడ్డున వున్న చెట్లు ఆ నీట మునుగగా అందు పైన వున్న కాకులు తమ ముక్కులతో నీరు తాగుతూ వున్నాయి . ఇటువంటి ప్రవాహం లో కూడా కొందరు పడవల మీదా తెప్పల మీదా , దుంగల మీదా నది దాటే ప్రయత్నం లో వున్నారు. ఇలాంటి గంగా ప్రవాహం లోకి - ఒక శక్తి వంతుడైన మానవుడు ఈతకు సిద్ధ పడినట్లు బుద్ధుడు చేతులు ముందుకు చాచి ప్రవాహం లోకి దూకాడు . దూకిన మరు క్షణం లో ఆవలి వడ్డున నిలిచి కనిపించాడు .

అప్పుడు అయన, ఇంకనూ గంగను దాటని వారిని , దాటే ప్రయత్నం లో వున్న వారిని, ప్రయత్నించే సాహసాము చేయలేని వారిని ఉద్దేశించి ఇలా పలికాడు:

"మహా సముద్రాల మీదా , మహా నదుల మీదా వారధులు నిర్మించిన వారున్నారు . వారు తమ పల్లపు ప్రాంతాలను తమ వెనుకనే విడిచి వచ్చారు .ఇంకొందరు వెనుకటి చోటులోనే వున్నారు. ఎవరూ అధిగమించ లేనటువంటి పల్లాలను జ్ఞానము అనేదే దాటిస్తుంది " .

{ పై విషయము చదివినపుడు- బుద్ధుడు ఈ లోకంలోని బాధలను వరదలో వున్నా నదీ ప్రవాహాలతో పోలుస్తూ ఉన్నాడని - తన కన్నా ముందు ఎందరో ఈ బాధలను {వరదలను } దాటటానికి అంటూ ఏవో వారధులు నిర్మించి అనగా భోదించి చెప్పి వెళ్లి పోయినారని - ఆ వారధులు అలాగే ఉన్నపటికీ - వాటిని ఉపయోగించుకో లేక/ వున్నా వాటి ఉపయోగం కానరాక ఇంకా కొందరు పల్లము అనగా బాధలు ముంచెత్తే చోటునే వున్నారని బుద్ధుడు అంటున్నాడని మనము గ్రహించ వచ్చు .

బుద్ధుడు గంగకు ఇటు వైపున దూకి అటు వైపున తేలాడు అన్న మాట - అయన మహత్యంలోని భాగము కాదు . ఆయన జ్ఞ్యానము అనే శక్తితో భాదలు అనే నదీ ప్రవాహాన్ని క్షణ కాలం లో ఈది బయట పడవచ్చునని భోదిస్తూ వున్నాడు అని . }

.వైశాలి కి బుద్ధుని పయనం

" ఆనందా మనము ఇప్పుడు "కోటిగామా" కు వెళ్ళుదాము ".అని బుద్ధుడు అన్నాడు

అలా వెళ్లి -- చాలా మంది భిక్షుల తో కూడి బుద్ధుడు కోటిగామా లో బస చేసాడు .

బుద్ధుడు బిక్షులను అనుగ్రహిస్తూ బుద్ధుడు ఇలా ప్రసంగించారు .

"భిక్షు లారా , చావు పుట్టుకలు { అనే నదీ తీరాల మధ్య- ఈ పోలిక నేను పోల్చాను  బుద్ధుని ప్రవచనం లో లేదు }  మధ్యన మీరూ నేనూ దాటి వస్తున్న  నిజాలు నాలుగు వున్నవి .  ఈ నాలుగు అత్యున్నత సత్యాలు , బాధ లేదా వేదన లేదా దుఃఖము అను  దానికి చెందినవి .

ఈ నాలుగింటి లో  మొదటినిజం  -  బాధ లేదా వేదన అనే  దానికి మూల కారణం ఎదో ఉంటుంది .

రెండో నిజము--  బాధకు విరమణ అనేది ఉంటుంది ; {అనగాబాధతనంతట తానుగా వెనక్కి తగ్గి విరమించు కుంటుంది * {01 -నది కి వచ్చిన వరద తనకు తానుగా విరమించుకుంటుంది .ఇది ప్రకృతి స్వభావము . దీనికోసము ఎవరూ ఏమీ ప్రయత్నం చేయనక్కరలేదు .02 . వుద్యోగం లో చేరిన ఒక ఉద్యోగి కి పదవీ విరమణ తధ్యం అయినట్లుగా --  మన మనసులోకి  చేరి న భాధ ఎదో ఒక నాటికి పదవీ  విరమణ చేసి వెళ్లి పోతుంది . ఇది కాలం తీసుకు వచ్చే విరమణ .  దీని  కోసం కూడా ప్రయత్నం ఏదీ అవసరం లేదు <>ఈ రెండూ నా అభిప్రాయాలూ }

మూడో నిజము-   మీరు భాధ లో నుండి  చొచ్చుకు పోగలుగుతారు.{ అనగా స్వంత ప్రయత్నం ద్వారా కూడా భాధను జయింప కలము అని }  , బాధ ను

నశింపు చేసుకోవటం ద్వారా మీ  మనుగడ ను గురించిన మీ ఆలోచనలు విరమిస్తారు ,

పై సంఘటనలో బుద్ధుడు గంగా ప్రవాహం కుండా చొచ్చుకు వెళ్లి - భాదలు అనే నదీ తీరపు ఆవలి వైపు చేరాడు . బుద్ధుడు ఆవలి తీరం చేరాడు - ఆ తరువాత ఈ బాధలతో మనుగడ సాగించటం ఎలా ?అన్న ఆలోచనకు అవకాశమే లేదు. అయన ఆలా ముందుకు సాగి పోవచ్చు }

నాలుగో నిజము - బాధలలోనుండి చొచ్చుకు పోవటం  మీకు  కొత్త జీవితం ఇస్తుంది . ఏమిచేసినా కానీ మరొక్క సారి తిరిగి తాజాగా జీవితాన్ని ప్రారంభించటం సాధ్యము కాదు  { అనగా నాకు బుద్ధి వచ్చింది అని పాస్చాత్తాప పడి--  నాకు మరల అవకాశం లభిస్తే ఆ తప్పును నేను   చచ్చినా చేయను అనుకోవటము గురించి. }{అందువలన ఒక పని చేయటానికి అవసరమైన జ్ఞానము ఎదో , దాన్ని ఓ పని మొదలు పెట్టె ముందే సేకరించుకోవాలి - ఆలా బాధలు సృష్టి కాకుండా చూసుకోవచ్చు }

ఈ నాలుగు నిజాలను గుర్తించకుండా - ఉంటే పుట్టుకనుండి మరణము వరకూ సాగే ప్రయాణము కఠినంగా ఉంటుంది . ఈ నిజాలను మీరు గుర్తిస్తే పునర్జన్మ కు గల కారణాలను సమూలంగా పెరికి వేసిన వారు అవుతారు . జన్మ పునర్జన్మ నుండి తప్పుకుంటారు "

{ బుద్ధుడు చెప్పిన ఈ నాలుగు నిజాలు బుద్ధుని యొక్క ఉపదేశాల సారంగా భావిస్తారు . కానీ వీటి పై ఇప్పటికీ స్పష్టమైన వివరణ లేదు అని భావిస్తారు. అందువల్ల నేను ఎదో వివరణకు పూనుకున్నాను . ఇహ , క్లుప్తంగా చెప్పాలంటే [1] బాధ అన్నది నిజము [2] బాధకు ఒక కారణము వుండునన్నది మరో నిజము [3} ప్రతి బాధా విరమణ తీసుకుంటుంది [4] జ్ఞ్యానము/ నిజము కనుక్కోవటం దానికోసం ఎంచుకున్న దారులు అనేవి బాధను నశింప చేస్తాయి .

---------------000-------

భగవంతుడు కాలము అనే ఒక వింత వృక్షము ను సృష్టించాడు . ఆ చెట్టుకు సుఖ దుఃఖాలు అనేవి విత్తనాలుగా పుట్టి భూమి పై పాతుకుంటాయి . విత్తు అన్నాక మొలకెత్తక తప్పదు కదా ? ఆలా మొలకెత్తిన ప్రతి విత్తనము మానవులకు సుఖమో దుఃఖమో అందచేసే ధ్యేయం తోనే ఓ మొక్కగా /చెట్టుగా ఎదుగుతుంది . ఈ చెట్టు మనకు సుఖామో దుఃఖమో ఎదో ఎదో ఒకటి అందించి తన మనుగడ ముగిస్తుంది . దాని మనుగడ ముగియగానే సుఖ దుఃఖాలు అదృశ్యం అయి పోవు . కాలం అనే మూల వృక్షము మరలా మరల విత్తనాలను వదులుతూ నే ఉంటుంది సుఖ దుఃఖాలు కాల చెక్రమ్ లోని భాగము

దుఃఖము/ బాధ తనకు తానుగా విరమణ తీసుకుంటుందని బుద్ధుడు ప్రవచించాడు. మనలోని కొందరు బాధా నివారణకు జ్ఞ్యానమును/ ఆలోచనలను ఆశ్రయించక హోమాలు పూజలు వంటి వాటి పైపు మొగ్గు చూపుతారు . ఈ హోమము/పూజలు జరిగిన 40 రోజుల తరువాత బాధా విముక్తి అని హోమాలు/పూజలు జరిపిన వారు పలుకుతారు . హోమము?పూజలు వల్ల

భాదా విముక్తి అయిందా ? లేక బాధ తనకు ఉన్న సహజ లక్షణం ప్రకారం విరమణ తీసుకుందా ? అని హోమాలు/పూజలు , చేయించుకునే వారు ఆలోచించాలి . ఎవరన్నా ఇలా ఆలోచిస్తే ఏమిటి గతి అని అలోచించి న హిందువులలో ని పెద్దలు కొందరు బుద్ధిజాన్ని వ్యతిరేకించారు అని నేను అభిప్రాయం పడతాను . నేను పూజలు అన్నది దేమునికి మనం నిత్యం చేసుకునే పూజలు గురించి కాదు . పూజలు అనే దాన్ని ఆదాయ వనరుగా ఎంచుకున్న గురువుల గురించి

పై రెండూ నా స్వంత అభిప్రాయలు

## మహా పరినిబ్బాన సుత్తము **18 -10 -24**

కోటిగామా లో వున్నా బిక్షులను ఉద్దేశించి గౌతమ బుద్ధుడు ఇంకా ఇలా ప్రవచించాడు . " సుగుణాలు , ఏకాగ్రత, జ్ఞానం. అనేవి గొప్ప ఫలాలను ఇస్తాయి . ఏకాగ్రత కు సుగుణాలు జత కూడినప్పుడు ఏకాగ్రత ఇంకా ఎక్కువ ఫలితాన్ని ఇస్తుంది . సంపాదించుకున్న జ్ఞానం నకు ఏకాగ్రత జోడు అయినపుడు అది మిమ్ములను కోరికలు అనే కల్మషాల నుండి విడిపిస్తుంది , అజ్ఞ్యానము లో ఉన్న మనస్సు , సంపూర్ణ జ్ఞ్యానముగా వృద్ధి చెందుతుంది

కోటిగామా లో ఇట్లాంటి ప్రసంగాలు ఇచ్చిన అనంతరం - బుద్ధుడు ఆనందునితో "ఆనందా మనము "నడిక" {Nadika } ప్రాంతానికి వెళ్ళుదాము అన్నాడు

బుద్ధుడు అనేక మంది బిక్షులతో కలిసి 'నడిక "లో ఉన్న ఒక ఇటుక రాతి ఇంటిలో బస చేసి వున్నాడు.

ఆనందుడు వచ్చి బుద్ధునికి వందనము చెప్పి ఆయన కూచో మనగా ఒక పక్కాగా కూచున్నాడు . కూచుని " దేవా .. భిక్షు సాళ్హ {Salha } మరియు బిక్షుని నంద గతించి పోయినారు . వీరి వలెనే అతి సామాన్యులైన  సుద్ధత్తా, కకుధ , కళింగ , నికతా , కతిస్సభా , టుత్త , సంతుత్థ , బద్ద , సుభద్దా మరియూ  సుజాత లు అను వారు కూడా గతించి పోయినారు . వారి గమ్యము ఏమిటి ? వారి భవిష్యత్ ఈమిటి ? అని ప్రశ్నించాడు .

. "ఆనందా -- సాళ్హ {Salha } , తమలోని కల్మష గుణాలను విస్మరించటమే జీవిత ధ్యేయంగా చేసుకొని - కల్మష రహితమైన మనసులనుపొంది , కల్మషము లేని లోకము చేరాడు . ప్రపంచము ను అణుడిలోని జ్ఞ్యానమును నేరుగా తెలుసుకోవటం అనే మార్గములో పయనించి అతడు ఆ స్థితిని పొందాడు .

"బిక్షుని నంద, గుడ్డివాడు పూవులను తడిమి చూసి వాటి రూపాన్ని తెలుసు కున్నట్లు చేసి తన జ్ఞనాన్ని క్షణ కాలంలో వృద్ధి పరుచుకున్నది . ఇలాంటి వారు ఐదు రకాల సంకెళ్లను తెంచుకున్నారు అవుతారు . వీరు "సుద్ధావాసా" దేవతల మధ్య జన్మిస్తారు .వారికి అక్కడ వారికి దొరికిన జీవిత కాలాన్ని వారు అక్కడనే అనుభవించి విరమిస్తారు . ఆ విరమణ తరువాత వారు - తిరిగి పుట్టవల్సిన వారిగా భావింప బడక , వేరే లోకాలకు పంప బడక , ఇక్కడకు తిరిగి రానవసరం లేకుండా , అక్కడే కొనసాగుతారు.

పాఠకుల కోసం - బుద్ధుని ప్రకారం మొత్తము ఫది సంకెళ్లువున్నవి . ప్రస్తుతము చెప్పబడిన  ఐదు సంకెలలు ఏమిటి అంటే ? [1] నేను అనే ద్రుష్టి : (సంస్కృత : సత్కాయ -ద్రుష్టి లేక  స్వకాయ -ద్రుష్టి  )  [2] తాము పాటించు చుండె ఆచారాల నుండి విడి పడుట: (సంస్కృత  లో : శిలావ్రత  -పరామర్శ -ద్రుష్టి [3]సందేహించ దాగిన అనుమానాలు కలిగి ఉండుట : (సంస్కృత లో : విచికిత్సా ) [4] జ్ఞ్యానేంద్రియాల కోసం పాకులాడటం (సంస్కృత లో : కామరాగ ) [5] దుష్ట సంకల్పాలు లేదా మంచిపట్ల వ్యతిరేకత  (Sanskrit: వ్యాపాద )

"ఇక సాధారణపు వాడిన   సుద్ధత్తా , , మూడు సంకెళ్లను తెంపుకో గలిగాడు  . నేను అన్న భావం , అనవసర అనుమానాలు , ఆచారాలను అనుసరించుట - అనే  సంకెళ్లు తెంపుకున్నాడు . ఇలాంటి వారు  తమలోని మరిన్ని సంకెళ్లను తెంపుకోవటానికి అని మరొక సారి ఈ లోకం తిరిగి వచ్చి బాధలతో జీవితం ముగిస్తారు. . అటు పిమ్మట కూడా వారు ఇదే లోకంలో తిరిగి జన్మిస్తారు

"ఆనందా సాధారణ భిక్షు  సుజాత ,విషయంలో ఆమె మూడు సంకెలలు తెంచుకుంది . ఈ తెంచుకొనుట  ఆమె పాలిట ఒక నదీ ప్రవాహంగా మారి ఆమెను  దుస్థితి లోకి పోకుండా కాపాడి ఆమెను జ్ఞ్యానము / మోక్షము అనే తీరము వైపుకు తీసుకు వెడతాయి

"ఆనందా --సాధారణపు వాడిన  కకుధ , ఐదు సంకెళ్లను తెంచుకున్నప్పటికీ -ఇతడు స్పరేసేంద్రియముల ద్వారా  అప్పటికప్పుడు జ్ఞ్యానము పొందిన వాని వంటి వాడు . ఇతడు  "సుద్ధావాసా" దేవతల మధ్య జనించి - అదే తన అంతిమ జన్మ గ పొందుతాడు . మరే జన్మా ఉండదు  .

" కళింగ , నికతా , కతిస్సభా , టుత్త , సంతుత్థ , బద్ధ , సుభద్దా లు మరియూ వారిలాగానే ఈ నాడీక ప్రాంతములో గతించిన అనేక మంది -- కామము , ద్వేషము భ్రమలు అనే మూడు సంకెళ్లను తెంపుకొని తిరిగి ఈ భూ లోకం లోకి ప్రవేశించే అర్హతతో వెళ్లారు . వీరు భూమిలో తిరిగి జన్మించి-- బాధలను అనుభవించి మరణించి - తిరిగి మరొక్క సారి ఇదే భూమిలో జన్మిస్తారు . { అనగాఈ నాడీక ప్రాంతములోనే తిరిగి జన్మిస్తారు . ఇది ఈ నాడీక ప్రాంతములో బుద్ధుడు అడుగు పెట్టిన పుణ్యాన జరుగుతుందని భావము }

"ఆనందా--- ఐదు వందల మందికి మించి న సాధారణ ప్రజలు ఈ నాడీక ప్రాంతములో గతించి వున్నారు - వీరికి మూడు సంకెలలు తెంచుకోవటం అనే ప్రక్రియ ద్వారా దొరికే నదీ ప్రవాహం దొరికి - తిరిగి జన్మించి దుఃఖము అనేది లేకుండా జ్ఞ్యానము కోసము జీవితం గడుపుతారు .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామకృష్ణ అఫ్ అమరావతి at bglr

మహాపరినిబ్బాన సుత్త -దీనిలో భాగమైన The Mirror of the Dhamma 21-10 -24

బుద్ధుడు చెపుతూ వున్నాడు " ఆనందా --ప్రతి మనిషీ మరణించి తీరాలి అన్న నియమం లో వింత ఏమీ లేదు . జీవి తనకు మరణము సంభవించిన ప్రతి సారీ అతడు తథాగతుని శరణు వేడాలి . {తథాగతుడు అనగా అన్ని

రాకపోకలకు అతీతమైన వాడు - అన్ని తాత్కాలిక భూ జనిత మైన విష యాలకు అతీతమైనవాడు అని } ఈ శరణు కోరటం కష్టమైన ప్రక్రియ ఏ కావచ్చును . అందువలన ఆనందా అటువంటి వారిని ఉద్దేశించి " ధర్మ దర్పణము " అనే దాని గురించి ఇపుడు నీకు తెలియ చేస్తాను . దీనిని ఆచరించి నా మార్గమును అనుసరించే వారు తమకు తాముగా "నేను ఏ నరకము లోనూ , ఏ జంతువుగానూ , ఏ దయ్యము గానూ , ఎవరి పాలనా కిందనూ జన్మించను " అని ప్రకటించుకోవచ్చు ను . అలాప్రకటించుకున్న వారు వీరు నేను ఏర్పరిచిన" ప్రవాహంలోకి "ప్రవేశిస్తారు . ఆపై వీరు జాలి గొలిపే జనన మరణ జీవిత చక్రం నుండి బయట పడే మోక్ష సాధన కు పూనుకుంటారు . '

"అయితే ఆనందా-- నేను భోదించే ధర్మ దర్పణము అను బోధనలను అనుసరించి , ఒక వ్యక్తి తనకు తానుగా మోక్షమును ప్రకటించుకోవచ్చు అని నీవు నమ్ముతూ ఉన్నావా ? అని బుద్ధుడు అడిగాడు .

"ఆనందా -- నాపై చెదరని నమ్మకము ఉంచిన వారు అర్హతు లు అవుతారు . Arahant, అయిన వారికి స్వచ్ఛమైన జ్ఞానము దాని ద్వారా మంచి నడవడిక లభిస్తుంది. వారు ఆనందము పొందిన వారు అవుతారు . దేవలోకంలోనూ మనుష్య లోకంలోనూ వారే పరమ గురువులుగా భావింపబడతారు,

"ధ్ధర్మము పై చెదరని నమ్మకము ఉంచిన వారు ధర్మమూ చేత ఆశీర్వదింప బడతారు . దర్మము స్వచ్ఛమైనది కాలానికి అతీత మైనది . తెలివైన వారు

తమకు తాముగా విషయాలను శోధించి, ధర్మము ఏదో - విముక్తికి మార్గము ఏదో గ్రహించాలి . ఇది ఏ వ్యక్తి కి ఆ వ్యక్తిగా గ్రహించాలి .

"బౌద్ధ ధర్మ అనుమాయిలు గా ఆర్య జాతి లోని నాలుగు రకాల వారు కూడా అర్హులే. .{ అంటే,, ఆర్య జాతిలోని - చతుర్ వర్ణాలు కావచ్చును } వీరు ధర్మాన్ని ఆచరించి ఉన్నతులు కావచ్చును . వారు ఉన్నత మైన సంఘీయులు గా మారవచ్చును . { ఉన్నతులు ఉన్న బౌద్ధ సంఘాన్ని అరియ -సంఘము అని, ఈ సంఘ సభ్యులను aarya -puggala ఆర్య -పుగ్గలా అంటారు అని నా వివరణ }

ధర్మాన్ని చక్క గానూ, అత్యంత నిష్ఠతోనూ ఆచరించిన వారు . జ్ఞానములో తమ పూర్వికులకన్నా ముందుకు వెళుతారు [ డాక్టర్ అంబెడ్కర్ ఇట్లాంటి వాక్యాలు పట్ల స్పందించి బుద్దిస్టుగా మారారేమో అని నా వూహ } అర్హతులు క్రమంగా ఎనిమిది రకాల మనుషులుగా రూపొందుతారు . వీరు వరుసక్రమంలో - సంఘము చేత గౌరవింపబడే హక్కును, కానుకలు స్వీకరించే హక్కును , ఆతిధ్యము పొందటంలో మొదటి హక్కును , పూజింప బడటం లో మొదటి హక్కును పొందుతారు. వీరు ప్రపంచము మెచ్చుకొనే పనులను చేస్తారు

పాఠకుల కోసం ఎనిమిది రకాల మనుస్యులు వాటికి అర్థాలు కూడా ఇస్తున్నాను -- సంస్కృతం లోనూ పాళీ భాషలోనూ రాయబడిన బౌద్ధ గ్రంధాల ను టిబెట్ వారో చైనా వారో అనువదించి పెట్టుకున్నారు . ఎనిమిది రకాల మనుష్యుల పేర్లు టిబెట్ భాషలోని గ్రంధాల లోవి . సంస్కృతంలో గానీ పాళీ

భాషలో కానీ బుద్ధుడు వీరి పేర్లను ఏమని పేర్కొన్నాడో  అనే వివరం నాకు దొరకలేదు .   కింది మాటలు టిబెటిన్ మాటలు

01 ] నీఇంగ్మా Nyingma  అనగా - బుద్ధుని మనసులోని విషయాలను గ్రహించి ఆ ప్రకారము చేసే వారు .పద్మసంభవుడు మరియూ శాంతరక్షిత అనే గురువులు ఈ తరగతి మనుషులు . వీరు బుద్దిని కి సాటి రాగల  దేముని గా పరిగణింప బడతారు

02 - కాదంప -Kadampa  అనగా బుద్ధుని యొక్క ప్రసంగాల ఆధారంగా జ్ఞ్యాన మార్గం ద్వారా  ఒక్కో మెట్టూ ఎక్కుతూ మోక్షము సాధించటానికి సమీపంలో ఉన్న వారు .వీరు బుద్ధిజాని కి సంబంధిన నియమావళి రూపొందించే అర్హత కలిగి వుంటారు

03 ] శాక్య Sakya  అనగా శాక్య వంశములో జన్మించిన  సిద్దార్ధ గౌతమునితో సమము అగు పుట్టుకని పొందిన వారు అని . అనగా వేరే వంశములో జన్మించినప్పటికీ  శాక్య వంశములో జన్మించిన అంతటి గౌరవము పొంద దగ్గ వాడు అని అర్ధము.{ విశ్వనాధ సత్యనారాయణ గారు రాసిన " దిండుకింద పోక చెక్క" అనే పుస్తకంలో శాక్య ముని ప్రస్తాపన ఉంటుంది .   అందులోని వివరణ దీనికి సరి పోతుంది }

04 . మార్పా  కగ్యూ = Marpa Kagyü అనగా బుద్ధుని బోధనలను సంస్కృతం నుండి  నుండి ఇతర భాషల లోకి రాయగల సమర్ధుడు .

05 .షాంగ్పా  కగ్యూ Shangpa Kagyü అనగా - బుద్ధుడు చెప్పిన విషయాలలో ని మర్మము గుర్తెరుగగల సమర్ధుడు

.06 .షిజి  మరియూ  చొ = .Shije and Chö అనగా తనకు ఎదురైనా కష్ట నష్టాల ను వెలుగుగా భావించి ఆ వెలుగులో తన మోక్షసాధనా  సామర్ధ్యాన్ని పెంచుకునే వాడు.

07 . జోడోరుఖ్ Jodoruk  అనగా - బుద్ధుని బోధనలకు ప్రభావితుడై వాటిని ప్రచారం చేస్తూ తిరిగే వాడు

08 . న్యేదుబ్=Nyendrub  అనగా పేరు సంపాదించుకున్న బౌద్ధ మత గురువు లేదా బౌద్ధ పూజారి

పై విషయాలు సంక్షిప్తముగా చేప్పాను . ఇంకా వేరే వివరణలు కూడా ఉండవచ్చు ను‹ అని నా మనవి.

"ఉన్నత మైన వ్యక్తుల కు సంతోషకరమైన ది , పూర్తిది , మచ్చలు లేనిది . శుద్ధము    అయినది , మనిషిని భందాల నుండి  విడిపించే ది అయినా ఆలోచనలను తమ సమాజం  నుండిఏ పొందే  వారు తమ ఆలోచనలలో ఏకాగ్రత కలిగి వుంటారు "

"ఆనందా ఇదే నేను భోదించే ధర్మ దర్పణము . దీని ద్వారా ఉన్నత మైన వ్యక్తులు - నన్ను నమ్మే వారు - వారికి వారుగా - నాకు నరకం లో కానీ మరెక్కడా కానీ తమకు పునర్జన్మ లేదు అని తెలుసు కుంటారు . వారు "నేను కష్టాలు నష్టాలు అనే సుడిగుండములో పడకుండా సురక్షితంగా మోక్షము సాధించ గలను" అని కూడా తెలుసుకుంటారు"

నా వివరణ - --"నేను ధర్మము అనుసరించి ప్రవర్తిస్తూ ఉన్నానా? లేదా అని ఒక మనిషి తనను ప్రశ్నించుకున్నపుడు - అతడు ధర్మ దర్పణాన్ని -- తన ప్రతి బింబాన్ని తనకు చూపమని కోరినట్లు . దర్మము ఎదో తెలిస్తే ఒక దర్పణము మన చేతిలో వున్నట్లే . దానిలో మన ప్రతిబింబాన్నిచూసుకుంటూ మనల్ని మనము చక్క దిద్దు కోవచ్చు . ఉదాహరణ ఏమిటంటే ? అందము అంటే ఏమిటో తెలిసిన ఓ స్త్రీ అద్దాన్ని చేబూని " నేను అందంగా ఉన్నానా? అని అద్దాన్ని అడుగుతుంది . " నిజానికి ఆమె అడిగిన ప్రశ్న అద్దాన్ని కాదు . అందము అనే దానిపట్ల తనకు గల తన బుద్దిని{జ్ఞనాన్ని/ అభిప్రాయాన్ని } ప్రశ్నించింది . ఇప్పుడు అద్దము " అవును నీవు అందంగా వున్నావు" అని చెప్పింది అనుకుందాము . ఇక్కడ కూడా అద్దము మాట్లాడినట్లు కాదు . అందము అంటే ఏమిటో అన్న దానిమీద ఆమెకు మనసులో కల జ్ఞ్యానమే ఆమె కు ఆ సమాధానం చెప్పింది . ఇప్పుడు ఆ స్త్రీ నేను అందగత్తెను అని ప్రకటన చేసుకో గలుగుతుంది కదా ? ..ఎవరు కాదన గలరు ?

ఇదే విధముగా దర్మము అనే అద్దంలో మనను మనము చూసుకొని - వచ్చిన సమాధానాన్ని పట్టి " నేను మోక్షానికి అర్హుడను " అని ఏమనిషికి ఆ మనిషి ప్రకటించుఃకోవచ్చు అని బుద్ధుడు భోదిస్తూ వున్నాడు . తనకు తాను సంతృప్తిగా అలంకరించుకున్న స్త్రీ ' నేను అందగత్తెను " అని ఎలా ప్రకటించుకుంటుందో

అదేవిధంగా ధర్మాన్ని తనకు తాను సంతృప్తి పడేట్లు ఆచరించిన మనిషి '
నేను మోక్షానికి అర్హుడను అని ప్రకటించుకోవచ్చు .

సేకరణ వివరణ రచన వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

మహా పరినిబ్బాన సుత్తము 22 -10 -24

ధర్మ దర్పణము ను ఆనందునికి ప్రవచించాక-- బుద్ధు డు - తనతో
పాటు నాదిక ,లోని ఇటుక రాతి ఇంటిలో వున్నపుడే బిక్షువులను
ఉద్దేశించి ఇట్లా పలికాడు " "సుగుణాలు ఎంతముఖ్యమో ఏకాగ్రత
మరియూ జ్ఞ్యానము కూడా అంతే ముఖ్యము అయినవి. ఏకాగ్రతకు
సుగుణాలు తోడైనపుడు దానినుండి లభించే జ్ఞ్యానము అనే ఫలము
అతి గొప్ప గా ఉంటుంది . పూర్తిగా వృద్ధి చేసుకున్న జ్ఞ్యానము
మిమ్ములను మీ మనస్సులోని కామము కోరికలు అనే సంకెళ్ళ నుండీ
విడిపిస్తుంది "

పై ప్రసంగము తరువాత బుద్ధుడు ఆనందునితో " మనము
వైశాలి కి వెళ్ళుదాము " అన్నాడు."

ఆనందుడు మరియూ బుద్ధుడు  వేలాది మంది బౌద్ధ భిక్కులతో కలిసి, వైశాలి లోకి  ప్రవేశించి అమ్బపాలి యొక్క వనం లో తన నివాసం ఏర్పరుచుకున్నాడు .

దీని తరువాత ఆమ్రపాలి యొక్క కథను వివరిస్తాను . ఈ కథ సినిమాలుగా కూడా వచ్చింది . కానీ ఆ కథ తెలియని వారు ఎవరైనా ఉంటే వారి కోసం అని రాస్తాను

ధర్మ దర్పణము

నిన్న ఆనగా 21 -10 -24 న పై విషయం మీద బుద్ధుని బోధనలు ఏమిటో రాసాను. .ధర్మమూ  మరియూ   దర్పణము అను మాట ఎందుకు వాడ బడింది?  అని నేను కొన్ని ఆలోచనలు చేసాను . అవి కింద పంచుకుంటున్నాను .

అలంకరించుకున్నాక  నేను ఎలా వున్నాను ?  - అని చూసు కో గోరిన వారికే దర్పణము అనేది అవసరము . నేను  ధర్మమును అనుసరిస్తూ ఉన్నానా లేదా - అని చూసు కో గోరిన వారికే ధర్మ దర్పణము అవసరము .

మానవుల జన్మకు  శోభనిచ్చే ధర్మము / ధర్మ ప్రవర్తన అనే అలంకార సామాగ్రి ఎక్కడనుండి లభిస్తుంది ?   ఈ సామాగ్రి ఎక్కాడో లేదు ,నీ సమాజం నుండి , నీ చుట్టుపక్కల పరిస్థితుల నుండీ -  జ్ఞ్యనము ను వుపయోగించి - నీకు  నీవు గా నీ ధర్మం ఏమిటో గుర్తెరగాలని  బుద్ధుడు బోధించాడు .

దీన్ని గురించి నా ఉదాహరణ   -- దేముడు మన యజమాని . మనం అయన సేవకులము లేదా జీతగాళ్ళము అనుకుందాము  . భూలోకంలో అయన తరఫున  ఒక పని పూర్తి చేసిపెట్టమని  అయన మనలను పుట్టించాడు అనగా ఓ ఉద్యోగంలోకి పెట్టుకున్నాడు .పెట్టుకుని  " ఆ రాతిని చెక్కు"అని ఆర్డర్ వేసాడు    .

రాతిని గుండ్రంగా చెక్కలా? పొడుగ్గా చెక్కలా?  వంటి విషయాలు అయన ఏమీ చెప్పలేదు అనుకుందాము.  అప్పుడు మనము ఏమిచేయాలి ? దేముడిని పిలిచి అడిగి వివరం  కనుక్కోవాలి . మనకుఓ  భాద్యత అప్పగించినాక దేముడు తిరిగి మనకు కనపడడు కాబట్టి అయన నుండి ఏమీ తెలుసు కోలేము . ఇప్పుడు మనము మన మనసుకు తోచిన రూపున రాతిని చెక్కవచ్చు లేదా చేయాల్సిన పనిపట్ల స్పష్టత లేదని చెప్పి పనిని  పక్కన పారేసి కూచో  వచ్చు .ఆ సాయంత్రం వేళా  " నీకు అప్పగించిన పని నీవు చేశావా ?" అని అడుగుతూ దేముడు వస్తాడు .

మనము చేయలేదు అని ఆయనకు తెలియగానే " రేపువచ్చి ఆ పని పూర్తి చేయి" అని చెప్పి పోతాడు . రేపు అనే మాట మనకు మరుజన్మ .  ఎన్ని జన్మలు ఎత్తినా గానీ నీవు చేయాల్సిన పని ఏమిటో  నీవే తెలుసుకొని నీవే

చేయాలి  అనేది అయన ఉద్దేశ్యము . ఈ జన్మలో మనకు కేటాయించిన  పనిని మనము చేయలేదు కాబట్టి - దానికి కారణం ఆయనే కాబట్టి - చెప్పి - మరు జన్మలో అనగా రేపువచ్చి ఆ పని ఎలా చేయవల్సిందీ  చెప్పాల్సిన భాద్యత దేమునిదే అని మనము అనుకుంటూ  ఉంటే - మనకు   జన్మతరువాత మళ్ళా జన్మా దొరుకుతూనే ఉంటుంది . దీన్ని తప్పించుకోవట ము ఎట్లా ? అంటే జ్ఞ్యానము పొందటం  ద్వారా దీన్ని తప్పించుకో అని బుద్ధుడు బోధిస్తూ వున్నాడు .

అంటే దేముడు "ఆ రాతిని చెక్కు" అని ఆర్డర్ ఇవ్వగానే - మనము ఇది ఏమి కట్టడము ? ఈ రాయి ఎక్కడ ఉపయోగ పడేది ?  దీని ఆకారం ఎలా ఉంటే మంచిది -  ఈ రాయిని ఏమిచేస్తే ?ఎలా తయారు చేస్తే ?  దేముడు తాను చేయాలని నిర్ణయించుకున్న పని పూర్తి అవుతుంది ?  మనకు మనమే అన్వేషించి  చేయాల్సిన పని పట్ల జ్ఞ్యానము పొందాలి .  ఇప్పుడు మనము తెలుసుకున్న విషయము/జ్ఞ్యానము  మన ము చేయవల్సిన పని ఎదో మనకి చెప్పింది . మనము చేసాము . ఆపై " బాగా చేసానా ? అని మనల్ని మనమే ప్రశ్నించుకోవాలి  . అనగా ధర్మ దర్పణం లో చూసుకోవాలి . మనలను మనము ప్రశ్నించుకోవటమే మన పాలిట దర్పణము ."బాగా చేసావు" అని అద్దం నుండి మనకు బదులు వస్తుంది అనుకుందాము .నిజంగా అద్దమే  బదులిచ్చిందనా ? కాదు  కదా ?   మనము ఏ జ్ఞ్యానము ను వుపయోగించి పనిచేశామో  -- అదే జ్ఞ్యానము " నీపనిని నీవు బాగా చేసావు " అని బదులిస్తున్నది . ఇలాగా ప్రశ్నించేది, జవాబు చెప్పేది, నీ భాద్యత నెరవేరింది అని ఓ ముగింపు పలికెడిది అన్నీ కూడా   జ్ఞ్యనమే అయ్యింది . ఇది జ్ఞ్యానము యొక్క విశిష్టత . సాయంత్రానికి అనగా మరణ కాలం నాడు,  దేముడు వచ్చి "పని పూర్తి అయిందా?"  అని యధావిధిగానే అడిగాడు . మీరు జ్ఞ్యానము ద్వారా చేయాల్సిన పని ఎదో తెలుసుకొని - దానిని చక్కగా చేసాను అని, నేను

చేయవల్సిన పని పూర్తి అయింది అని  కూడా తెలుసుకున్నారు . " అందువల్ల మీరు దేమునితో " మీరు చెప్పిన పని చక్కగా  నెరవేర్చాను . నా వంతు  పని పూర్తి అయింది . నేను రేపు పనిలోకి రాకుండా మినహాయింపు ఇవ్వండి" అని కోరవచ్చు.

"కాదు" అనటానికి దేమునికే అవకాశం లేనట్లుగా, ఈ పాటికే  మీరు మీ ధర్మాన్ని గుర్తెరిగి జీవించారు  .  జ్ఞ్యానము మూలంగా దేముని ఆలా కొరగల శక్తీ మీకు వచ్చింది . ఈ రకంగా "నాకు  మరు జన్మ లేకుండా చేయండి"  అని ఎవరైనా దేముని కోరవచ్చు .

పైరకంగా జ్ఞ్యానం  వలన  మీకు మరు జన్మ లేకుండా కోరుకునే అవకాశం మీ చేతుల్లోకి వచ్చింది .బుద్ధుడు ఇదేవిషయాన్ని "  మీరు జ్ఞ్యానము సంపాదించుకున్నాక - నాకు మరు జన్మ అంటూ లేదని మీకు మీరే ప్రకటించుకోవచ్చు అనే మాటల ద్వారా  చెపుతున్నాడు

## అమ్బపాలి కథ    **24 -10 -24**

పాళీ భాషలో ని  "అమ్బపాలి" అని పలికే పేరును సంస్కృతం లో "ఆమ్రపాలి" అని పలుకుతారు.  . ఈమె వైశాలి దేశపు రాజ నర్తకి . ఎంతో సంపద ఎన్నో ఘనతలు సాధించిన స్త్రీ . బుద్ధుడు ఈమెను  శిస్యు రాలిగా స్వీకరించినపుడు తనకు ఉన్నఅన్ని భౌతిక సంపదలనూ బుద్ధునికి ధార పోసింది .

ఆమ్రపాలి యొక్క కథ  కథ హిందూ - బౌద్ధ  , జైన మతాల కథకులు తలో రకంగా చెపుతారు  . ముగ్గురూ మూడు రకాల ముగింపులు ఇచ్చారు . ఒక బౌద్ధ కథగా దీన్ని తెలుసుకుందాము  .

ఆమ్రపాలి   600-500 BC.నాటికి నిజంగా ఉన్న స్త్రీ . వైశాలి లోని రాచ ఉద్యాన వనము లోని ఒక మామిడి చెట్టుకింద ఒక అనాధ శిశువుగా అక్కడి తోటమాలి కి ఈమె దొరికినందున ఈమెను ఆమ్రపాలి అనే పేరుతో పిలుస్తారు . ఆమ్రపాలి అనగా "మామిడి  చిగురు"అని అర్ధము .

ఆమ్రపాలి తన 11 వ సంవత్సరం  నాటికే వైశాలి లో కెల్లా అందగత్తెగా గుర్తించ బడింది . అనేక మంది పురుషులు ఆమెను మోహిస్తూ ఉండటం  వల్ల - వారి బారి నుండి ఈమెను తప్పించటానికి అని ఈమెకు వైశాలీ నగర రాజ నర్తకి పదవిని ఇచ్చారు.

ఆమ్రపాలి , తన యవ్వనపు మొదటి దశలోనే ఒక  యువకుడిని ప్రేమించి పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం లో వున్నది .వైశాలీ రాజు మనుదేవ్ , ఆమ్రపాలి ఇష్టానికి వ్యతిరేకముగా ఆమెను తన సొంతము చేసుకోవాలనుకున్నాడు  . ఆమ్రపాలి వేరొకరి సొత్తు కారాదని ఆలోచించిన  రాజా మనుదేవ్--   ఆమ్రపాలి కి  పెళ్లి జరగనున్న  రోజుననే  ఆమె ప్రియుడిని  చంపించి,  ఆమెను "నగర వధువు " గా  ప్రకటిస్తాడు .  నగరవధువు అంటే ఆమెను ఎవరైనా   ప్రేమించ వచ్చు ఆ ప్రేమను బహిరంగ పరుచుకోవచ్చు ., ఆమెకు వున్న " నగర వధు" అనే పేరు అందరికీ  కల్పించే అవకాశం ద్వారా ,  తాను కూడా అమ్రపాలిని  ప్రేమించానని బహిరంగంగా ప్రకటించుకో వాలన్నది రాజు గారి వూహ .

ఈ పదవితో పాటు ఆమ్రపాలి కి "జనపద కళ్యాణి " అనే బిరుదు పదవి కూడా ఇచ్చారు . ఈ హోదాలో ఆమె కు తనను ప్రేమించానని చెప్పే వ్యక్తుల నుండి తాను ప్రేమించ దలచిన వ్యక్తిని ఎంచుకునే హక్కు దొరుకుతుంది . ఈ రకంగా ఆమె వైశాలీ రాజునూ కూడా తిరస్కరించవచ్చు లేదా ఎంచుకో వచ్చు . వైశాలి రాజ్యము ప్రజాస్వామ్య రాజ్యము కావటం తో - ఆ నాటి ప్రజలు అనుసరించే సామాజిక న్యాయము ను అనుసరించి ఆమెకు ఇటువంటి హక్కులు దొరికాయి .ఇది - ఆమె తన ప్రియుని కోల్పోయినందుకు గానూ దక్కిన ఊరట అని కూడా అనవచ్చును .

ఆమ్రపాలి యొక్క అందము గురించి - వైశాలి కి పక్కరాజ్యమైన మగధ రాజ్యానినికి రాజైన బింబిసారుని చెవిన పడింది . ఆమ్రపాలి మీద కోరికతో బింబి సారుడు వైశాలి మీదకు దండెత్తి వచ్చాడు . యుద్ధము దాని దారిన అది జరుగుతూ నే ఉండగా - బింబిసారుడు మారు వేషంలో వెళ్లి ఆమ్రపాలి ఇంటిలోనే ఆశ్రయం పొందుతాడు .తన ఇంటిలో వున్నది బింబి సారుడని ఆమ్రపాలి కి తెలియదు . వీరి ఇద్దరి మధ్య నిజమైన ప్రేమ పుడుతుంది . వీరికి ఒక కుమారుడు కూడా జన్మిస్తాడు .

.చివరికి ఎప్పుడో తాను ప్రేమిస్తున్నది బింబి సారుడిని అని ఆమ్రపాలి తెలుసు కుంటుంది . తమ దేశం మీద యుద్ధాన్ని మాని వేయమని తన ప్రియుడిని కోరుతుంది . యుద్ధం ఆగి పోతుంది. వైశాలి నగరంలోకి ప్రవేశించి ఒక స్త్రీ యొక్క ఇంటిలో దాగున్న పిరికి రాజుగా, ఒక స్త్రీ కోరిక మీద యుద్ధ విరమణ చేసిన కాముకునిగా తనకు చెడ్డ పేరు రాకూడదు అని ఆలోచించిన బింబి సారుడు తన ప్రేమ గురించి లోకానికి తెలుపుకోడు .

బింబి సారుడికి ఆయన భార్య అయిన  చేలన కు పుట్టిన సంతానము అజాతశత్రు . ఇతడు తన తండ్రి నుండి వారసత్వంగా తనకు దక్కవలసిన రాజ్యము ఎంతకూ దక్కక పోవటానికి విసుగు చెంది,  తన తండ్రిని చంపి మగధకు రాజు అవుతాడు .  .

దీని తరువాతి కథ జైన సాహిత్యాన్ని అనుసరించి ఇలా ఉంటుంది " అజాత సెత్రుడు తనకు జన్మించిన కుమారునికి గోరుముద్దలు తినిపిస్తూ,  తన తల్లిని చూసి " కుమారుని పై నాఅంతటి ప్రేమ కల తండ్రి మరొకరున్నారా ? అని ప్రశ్నిస్తాడు . "  నీ తండ్రి వున్నాడు  " అని ఆమె బదులిచ్చి , అతని తండ్రి అతనికి జరిపిన ముద్దు ముచ్చట్లను- తినిపించిన గోరుముద్దలు  గుర్తుకు చేసుకుంటుంది . దీనితో అజాత సెత్రు సిగ్గు పడి తండ్రిని జైలు నుండి విడుదల చేయ తలుస్తాడు . ఆ ఉద్దేశ్యం కలిగిన వెంటనే  " ఇంకా అలాస్యము చేయరాదు " అన్న తలంపుతో అజాత సెత్రుడు  ఒక గొడ్డలి చేబూని  తండ్రికి ఉన్న సంకెలలు ఛేదించేందుకు గానూ   తండ్రి ఉన్న ఖైదు వద్దకు నడు స్తాడు. గొడ్డలి చేబూని వస్తున్న కొడుకును చూసిన బింబి సారుడు - కొడుకు తనను చంపటానికి వస్తున్నాడు అని పొరబడి .చేతి వేలికి ఉన్న ఉంగరం లోని విషం మింగి మరణిస్తాడు . చివరి ప్రార్ధనలు కూడా చెప్పుకోకుండా తండ్రి మరణించటం అనే  విషాదాన్ని జీర్ణించుకోలేని   అజాతశత్రువు మనస్తాపంతో తన రాజధాని ని చంపా  నగరానికి మారుస్తాడు .ఒక దుఃఖము మర్చి పోవటానికి అని ఏదో ఒక పెద్ద కట్టడపు నిర్మాణానికి పూనుకోవటం అనే విధానము  ఆనాటికే వుంది . దానిని అనుసరించి  అజాతశత్రువు పట్టణ నిర్మాణము చేసాడు అని నా వివరణ . తాజమహల్ , భాగ్యనగరం వంటివి ఒక విషాదాన్ని ఎదుర్కోవటానికి కట్టిన కట్టడాలే   కదా ?

ఒకరికి ఆఖరి ప్రార్ధనలు చేసుకొనే అవకాశం ఇవ్వక పోవటం అనేది ఆ మరణానికి కారకులైన వారిని ఎంతైనా వెంటాడి భాదిస్తుంది . అందుకే మరణ శిక్ష పడిన వారికి చివరి ప్రార్ధన చెప్పుకునే అవకాశం ఇస్తారు . మరణాన్ని ఒక దీర్ఘ నిద్ర అని కూడా కొందరు పిలుస్తారు . అది కూడా నిజమే . అలసి పోయిన దేహాన్ని సేద తీర్చి రేపటి పనులు చేయటానికి వీలుగా మనము నిద్రిస్తాము .శిధిల మవుతున్న దేహాన్ని వీడి మరొక దేహాన్ని పొంది - ఇంకెన్నో మంచి పనులు చేయటానికి వీలుగా మనుషులు మరణిస్తారు . నా భార్య కూడా ఈ కారణంగానే దీర్ఘ నిద్రలోకి వెళ్ళింది , అని నేను ఈ సందర్భంగా చెప్ప తలిచాను .

ఈ కధకు సంభందించి బుద్ధిష్ట్ లు చెప్పేది ఇలా ఉంటుంది . అజాతశత్రు తన తండ్రిని ఖైదు చేసి నాక ఎన్నోక్రూర శిక్షలు అమలు జరిపాడు . అన్నము నీరు ఇవ్వకుండా భాదించాడు . తన భర్త అయిన బింబి సారునికి అన్నము - నీరు ఇచ్చేందుకు అయన భార్య కోసల ఎన్నో దారులు వెతికింది . అజాత సెత్రుడు తన తల్లి కనుగొన్న ప్రతి దారినీ అడ్డగించి భగ్నపరిచి - తన తల్లి తన తండ్రికి ఆహారం ఇవ్వకుండా చేసి మరీ తండ్రిని ఇంకా ఏంటో బాధించాడు .

బింబి సారుడు తన జైలు గది కిటికీ నుండి ఒకొండ పైకి చూస్తూ వుండే వాడు . ఈ కొండపైన బుద్ధుడు తన అనుమాయిలతో కలిసి విడిసి వున్నాడు . లీలా మాత్రంగా నైనా సరే బుద్ధుని దర్శనం దొరకవచ్చేమో ? అన్న ఆశతో బింబిసారుడు కొండవైపు చూస్తూ ఉండేవాడు . ఇది తెలిసినాక అజాత సెత్రువు ఆ గదికి ఉన్న కిటికీని మూయించి ఎల్లెడలా చీకటే ఉండేట్లు ఏర్పాటు చేసాడు .

ఇటుతరువాత బింబి సారుడు " బుద్ధుడు ఈ నగరం లో ప్రవేశిస్తే అయన నుండి వచ్చే వెలుగును నేను చూడగలుగుతాను కదా ? " అనే ఆశతో, జైలు ద్వారపు చిల్లుల నుండి బయటకి చూడటం మొదలెట్టాడు . ఇది గ్రహించాక అజాత సెత్రువు మరింత కృారుడై , తండ్రి ఎటూ కదలకుండా వుండాలని చెప్పి అయన అరికాళ్ళ చెర్మం ఒలిపించేసాడు .

ఒకనాడు , అజాతశత్రు - తన తల్లి మాటల వల్ల - తన తండ్రి తనను ఎంత ప్రేమగా చూసిందీ గుర్తుకు తెచ్చు కున్నాడు . తండ్రిని జైలునుండి వదిలి వేయటానికి నిర్ణయించుకున్నాడు . తనను విడుదల చేసి నట్లే విడుదల చేసి . ఆపై తన కొడుకు తన పట్ల ఇంకా ఎదో ఘాతుకానికి ఒడ గట్టనున్నాడని { ఎదో ఎన్కౌంటర్ లాంటిది చేస్తాడని } - కొడుకు చేతులో హింస పడరాదని , అలా మరణించ రాదనీ కోరుకుంటూ బింబిసారుడు తన ప్రాణాలు తానే తీసుకున్నాడు .

తండ్రి మరణం తరువాత- ఆధుఖాన్ని మర్చి పోయే ఉద్దేశ్యముతో -- అజాత శత్రువు మగధ కి వ్యతిరేకమైన లిచ్ఛవులు పాలించే వజ్జి దేశము మీదకు , వైశాలి , కోసల , కాశి వంటి రాజ్యాల మీదకు యుద్ధానికి వెళ్లి వాటిని జయించాడు .

ఏమో అనుకుంటాము కానీ - ఎవరికైనా సరే తండ్రి మరణించిన దుఃఖము తప్పక మనసున నాటి తీరుతుంది .సాధారణ ప్రజలు తద్దినాలు పెట్టి ఆ దుఃఖాన్ని తీర్చుకుంటారు. అజాతశత్రు విధ్వంసము సృష్టించటం ద్వారా తన తండ్రి మరణించిన దుఖ్ఖాన్ని మాన్చు కొనే ప్రయత్నం చేసాడు .

వైశాలి ని జయించిన ఆనందముతో , అజాతశత్రు వైశాలి పురవీధులలో ఊరేగింపుగా నడువ సాగాడు . అజాతశత్రు కూడా ఆమ్రపాలి అందం గురించి విని వున్నాడు . అతడు ఒకనాడు ఆమెను సందర్శించి ఆమె అందం ముందు మోకరిల్లాడు . ఆమెకూడా అజాత శత్రువుని ప్రేమ దృష్టితో చూసి ఆదరించింది. ఇద్దరికీ శారీరక సంభందం ఏర్పడింది . అప్పటికి-- ఆమ్రపాలి ప్రేమ కామ ఆవేశాలకు అతీతురాలు కాని సాధారణ స్త్రీ గా వున్నది . కానీ దీనికి వైశాలీ పౌరులు అభ్యంతరం చెప్పి ఆమె ఒక కులట లా ప్రవర్తించింది కాబట్టి ఆమెను శిక్షింపాలని కోరారు . ప్రజల ఒత్తిడి మేరకూ ఆమె కారాగారం లో బంధింప బడింది . తాను ప్రేమించిన ఆమ్రపాలి కి ఖైదు లభించిందన్న కోపంతో అజాత సెత్రు వైశాలీ నగరాన్ని అగ్నికి ఆహుతి చేసాడు .వేలాది మందిని నరికి చంపాడు . ఆమ్రపాలి ఖైదు నుండి బయటికి వచ్చింది . తన ప్రేమను చాటుకున్నాను అని అజాత సెత్రువు అనుకున్నాడు .నా వల్ల నా మాత్ళ భూమి నాశనం అయింది అని ఆమ్రపాలి దుఃఖ పడింది . తన eeదుఃఖ నివారణకు గానూ ఆమె బుద్ధుని ఆశ్రయించింది .

అజాత సెత్రు వు రాజ్యములోనే అజాతస్త్రువు ప్రేయసి ఎలా ఖైదు చేయపడింది ? అంటే అది ప్రజావాణికి ఉన్న బలం అని చెప్పుకోవాలి . ప్రజాగళానికి వ్యతిరేకంగా అజాత సెత్రు కూడా ఏమీ చేయలేక పోయాడని - ప్రభువులకన్నా ప్రజలే గొప్పవారని మనము గ్రహించుకోవాలి .

ఇప్పటి తన ప్రియుడు అయిన అజాత సెత్రువు -- ఒకప్పటి తన ప్రియుడైన బింబి సారుని కొడుకే నని ఆమ్రపాలి కి తెలుసునా లేదా ?, తనకు పుట్టిన బిడ్డకు బింబిసారుడే తండ్రి అని ఆమ్రపాలి కి తెలుసునా లేదా ?, అజాత సెత్రుడు తండ్రిని చంపిన క్రూరుడు అని - అంతటి క్రూరుడిని తాను ప్రేమించానని

ఆమ్రపాలి కి తెలుసునా లేదా అన్న సంగతిని బౌద్ధ గాధలు వివరించవు .జరిగిన సంఘటనల వల్ల  ఆమె అనేక రకాల దుఃఖాన్ని చవి చూసిందని మాత్రమే బౌద్ధగ్రంధాలు చెపుతాయి .

అజాతశత్రు అనేక రాజ్యాలు కలిసిన ఓ పెద్ద రాజ్యానికి చెక్రవర్తి అయినాడు . అతడు మగధ రాజ్యాన్ని మరింత పటిష్టం చేయట ము కోసము గంగా తీరము ఒడ్డున పెద్ద కోటను కట్టించాడు . సునీధ  మరియూ  వస్సకార , అనే మంత్రుల ఆధ్వర్యంలో ఈ కోట నిర్మాణము జరిగింది . ఈ కోట నిర్మాణము జరిగిన ప్రదేశము పేరు పటలా  గ్రామా . కోట నిర్మాణము అయ్యాక ఈ వూరు పాటలీపుత్ర అయ్యింది .  అది నేటి పాట్నా గా మనకు తెలుస్తున్నది .  బుద్ధుడు ఈ పట్టణాన్ని ఎంతో పొగిడి - మూడు విపత్తులు - పాటలీ పుత్రని నాశనం చేయనంత వరకూ ఆ పట్టణము వర్ధిల్లుతుందని ఆశీర్వచనం పలికాడు .  ఇదే సంగతిని  మనము ఇంతకు మునుపే- ఇదే మహా పరినిబ్బాన సుత్తములో భాగంగా - బుద్ధునికి  ఆనందునికి  మధ్య జరిగిన సంభాషణ ల ద్వారా తెలుసు కున్నాము . { నిప్పు నీరు భిన్న అభిప్రాయాలూ అనే మూడు దేనినైనా నాశనం చేసే విపత్తులు - అని బుద్ధుడు పలికాడు }

అజాత శత్రువుని అతని కొడుకు "ఉదయాభద్ర" అను నతడు  చంపి వేసాడు . తన మరణం తరువాత  అజాతసెత్రువు  "లోహకుమ్బియా " అనగా  లోహపు పాత్రలలో మనుషులను ఉడికించి వేయించే నరకము లో పుట్టాడు అని బుద్ధిజం చెపుతుంది . ఇతడు అనేక జన్మలు ఎత్తి బుద్ధుని బోధనలు చూపిన దారిలో నడిచి చివరిలో మోక్షము పొందాడు .

అజాత సెత్రువు మరు జన్మలు ఎత్తి నపుడు  బుద్ధుడికి ముఖ్య అనుమాయిగా మారి బుద్ధుని అస్థికలు మీద పెద్ద స్తూపాన్ని కూడా నిర్మించాడు .  బుద్ధుడు అనేక జన్మలు పొంది వున్నాడని జాతక కథలు వివరిస్తాయి . అందువల్ల తన ఎదో ఒక జన్మలో  అజాత సెత్రువు  బుద్ధుని యొక్క శిష్యుడు ఐనాడని చెప్పటం సాధ్యమైంది .

తన జీవితము - తన అందము - తనను పొందాలి అనే కోరిక యుద్ధాలకు- జనావళి   మరణాలకు కారకం ఐంది అని దుఃఖించిన   ఆమ్రపాలి - తన దుఃఖానికి విరుగుడు కోసమై బుద్ధుని ఆశ్రయించింది . ఆయన్ని చూడాలని భోజనం తినిపించాలిఅని అయన పరిచర్యలలో ఉండాలి అని  కోరుకుంటూ ఉండేది ..ఇటువంటి ఆమ్రపాలి యొక్క వనం లో బుద్ధుడు విడిది చేసాడు  . బుద్ధునికి వైశాలిలో రాజ ఆహ్వానమే వున్నది . దాన్ని కాదని బుద్ధుడు ఆమ్రపాలి వనంలో విడిది చేసి ఆమె ఇచ్చిన బిక్ష స్వీకరించాడు .బిక్ష అనంతరము ఆమ్రపాలి తన సంపద - బుద్ధుడు విడిసి ఉన్న మామిడి వనం తో సహా - అంతా బౌద్ధ సంఘానికి ఇచ్చి వేసింది .

ఈ సందర్భంగా బుద్ధుడు విడిది చేసిన మామిడి వనం ఆమెకు ఎలా సొంత మయింది ? ఎవరి నుండి అన్నా ప్రేమ కానుకగా స్వీకరించిందా? బుద్ధుడు పూర్వ పర విచారము చేయకుండానే ప్రతి కానుకా స్వీకరించే వాడా ?   అనే ఆలోచన కూడా నాకు వచ్చింది  . ఆమె మామిడి వనం లో పుట్టింది కాబట్టి - అది ఆమె పుట్టినింటి కింద భావించబడి, ఆ వనం పై ఆమె సర్వ హక్కులు పొందింది అనే ఆభిప్రయం కలిగించే  వివరణ దొరికింది  . అనగా ఆమ్ర పాలి అనే ఆ పిల్ల ఓ మామిడి వనం లో దొరికింది కాబట్టి - దేముడు ఆ చోటును ఆమె

పుట్టుక కోసం ఎంచు కున్నాడు కాబట్టి , ఆ వనం ఆమెకు చెందుతుంది  అనే జన సామాన్య అభిప్రాయం ప్రకారం ఆ వనం ఆమెకు దక్కింది .

నా భార్య ఉమా దేవి 11 -09 -2024  న మరణించింది .ఆమె తన ఆఖరి ప్రార్ధనగా - గతించి పోయిన ఆమె ఇద్దరు అక్కలనూ  " ఓ పెద్ద క్కాయి . ఓ రామా అక్కాయి అని తలచు కొని -- ఓ దుర్గమ్మా,  ఓ బాల చాముండీ, ఓ కాళీ దేవీ "  అని పిలుస్తూ స్మరించింది   .  "రక్షించండి - నను కాపాడండి " అనే మృత్యు ఘోష  మాత్రం చెయ్యలేదు . మరణానికి ఎన్నో గంటల ముందే తన ఈ దైవ స్మరణ పూర్తి చేసుకొని - ప్రశాంతత పొంది అదే ప్రశాంతత మరియూ ప్రశాంత వదనం తో మరణించింది.

మరణానికి ముందు ఆఖరి ప్రార్ధనలు చెప్పుకోవటానికి అవకాశం దొరకటం వారికి ఎంతో ప్రశాంతత నిస్తుంది . ఆ ప్రసత్తే  వారి ముఖంలో కూడా ప్రకాశిస్తుంది . ప్రశాంతత పొందకుండా మరణించిన వారి ముఖ కావళికలలోని అసహ్యాన్ని -

చూసి ఏ మానవుడూ తట్టుకోలేడు .



Varanasi vumadevi died on 11-09-24 to reborn elsewhere



## Above is Amrapali image in sculpture

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

